# చందమామ కేమెల్
## రంగుల పోటీ
ప్రవేశ రుసుము లేదు




**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.
P.B. No. 9928, COLABA, Bombay-400 005.
ఫలితములు తుది నిశ్చయముగాను, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________ Age __________
Address ______________________________
దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.
ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. *30-4-1979*

**CONTEST NO.8**

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

VISION











AMRUTANJAN
Pain Balm
Amrutanjan Ltd.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''సైనికుడి ప్రవర్తన''] ''లక్ష్మి వసుంధర'' రచన. ప్రపంచంలో అందరూ స్వార్థదృష్టితోనే పనిచేస్తారు. కాని వృత్తిధర్మానికి అనుగుణంగా స్వార్థం ఉంటుంది. వర్తకుడి స్వార్థం వేరు, సైనికుడి స్వార్థం వేరు. ఇదే ఈ కథలో ఉండే సత్యం.

## అమరవాణి

సహస్రాణ్యపి మూర్ఖాణాం
యద్యుపాస్తే మహీపతిః ;
అథవా ప్యయుతాన్యేవ
నాస్తి తేషు సహాయతా. 1

[రాజు మూర్ఖులను ఎన్నివేలమందిని సంపాదించినా వారివల్ల ఎంతమాత్రమూ ఉపయోగం ఉండదు]

సంపుటి 64 ఏప్రిల్ '79 సంచిక 4

విడి ప్రతి : 1-25 సంవత్సర చందా : 15-00









**వై. హేమసుందర్రావు, దోర్నకల్ (ఆంధ్ర)**

ప్ర: అర్ధరాత్రి సూర్యుడు వుండే దేశము నార్వే అంటారు కదా. అక్కడ అర్ధరాత్రి పూట సూర్యుడు వుండటానికి గల కారణం తెలుపుతారా ?

న: భూమి సూర్యుడి చుట్టూ తిరిగే కక్ష్య ఒకటి ఉన్నది. అది దాని చుట్టూ తిరిగే "ఇరుసు" ఆ కక్ష్యకు ఏటవాలుగా ఉన్నది. ఇందువల్ల భూమి ఒక్కసారి సూర్యుడి చుట్టూ తిరిగివచ్చే 12 నెలల కాలంలో 6 నెలలు సూర్యుడు ఉత్తరాన ఉండటమూ, మిగతా ఆరు నెలలూ దక్షిణాన ఉండటమూ మనకు తెలుసు. ఆ కాలాలను ఉత్తరాయణం, దక్షిణాయనం అంటాం. సూర్యుడు పూర్తిగా ఉత్తరానికి వెళ్ళినప్పుడు ఉత్తరధ్రువ ప్రాంతానికి చుట్టూ ఉండే ప్రదేశంలో సూర్యుడు అస్తమించటం జరగదు. ఉత్తరధ్రువ మండలానికి చేరువలో ఉండే దేశాలలో కొన్ని రోజుల పాటు "అర్ధరాత్రి" కూడా సూర్యుడు అస్తమించడు. కొన్ని ప్రాంతాలలో రాత్రి కొద్ది గంటలు మాత్రమే ఉంటుంది. నార్వే కన్న గ్రీన్‌లాండ్ లాగా ఉత్తర ధ్రువానికి ఇంకా చేరువగా ఉన్న దేశాలున్నాయి.

**కె. జి. వరళకుమారి, కె. జి. హేమలత, కుప్పం (ఆంధ్ర)**

ప్ర: ఒకరితో ఏదైనా మాటాడాలంటే మొదట భాష ప్రధానం కదా, అసలు ఈ భాష ఎలా పుట్టింది? ఎప్పుడు? దీనిని ఎవరు వ్యాప్తి చేశారు? అసలు ఇన్ని భాషలు ఎలా కనుగోగలిగారు ?

న: భాష అన్నది వస్తువులకూ, చేతలకూ, భావాలకూ సంకేతం. ధ్వనులు చేయగల జంతువులు కూడా కొన్ని ధ్వనుల ద్వారా తమ జాతి వాటికి తమ భావాలు తెలుపగలవు. ఆపదలో ఉన్న కాకి ఒక రకంగా అరిచి వంద కాకులను రప్పించగలదు. మానవుల మధ్య భావవ్యాప్తి హెచ్చినకొద్దీ భాష పెరుగుతుంది. ఆటవిక జాతుల భాషలలో చాలా కొద్ది మాటలే ఉంటాయి. ఉదాహరణకు, సవరభాష మాటలు సంకేతాలని గ్రహించినాక, అవి అర్ధమయేవారంతా సహజంగా ఆ భాషకు చెంది ఉండాలి. మనకు తెలీని భాషలో "పాము" అని హెచ్చరించినా మనం కనుక్కోలేం. వేరు వేరు సంఘాలు వేరు వేరు భాషలను సృష్టించుకున్నాయి. వాటిని ఇతరులు సంపర్కం ద్వారా కనుక్కున్నారు.




## 70

"ఎవరుగాని ముందూ వెనకా ఆలోచించ కుండా తొందరపడి ఏదో చేసి, తరవాత తాపీగా పశ్చాత్తాపపడరాదు 'మంగలీ-మునులూ' కథ నుంచి అందరూ గుణ పాఠం నేర్చుకోవచ్చు," అన్నాడు విష్ణుశర్మ.

"ఆ కథ ఏమిటి?" అని రాజ కుమారులు అడగగా, విష్ణుశర్మ ఇలా చెప్పాడు:

పాటలీపుత్రం అనే నగరంలో మణి భద్రుడు అనే గొప్ప వర్తకుడు ఉండే వాడు. అతను దానధర్మాల కిందా, మత కార్యకలాపాల కిందా, ఇంటిఖర్చు కిందా లక్షలకు లక్షలు ఖర్చు పెట్టేవాడు. కళింగపట్టణం, కాయల్, కోర్కై లాటి రేవులలో అతని వర్తకం భారీగా జరిగేది. అతని నౌకలు బంగాళా సముద్రం దాటి వెళ్ళేవి.

ఒకసారి అతని నౌకలన్నీ బంగాళా సముద్రంలో ఉండగా ఆ సముద్రంలో తీవ్రమైన ఉప్పెన వచ్చి, ఒక్క నౌక దక్కకుండా అన్నీ మునిగిపోయాయి. మణిభద్రుడు పూర్తిగా చితికిపోయాడు. కోటీశ్వరుడు కాస్తా బికారి అయాడు. అప్పటిదాకా అతని కటాక్షం కోసం పాకులాడిన ధనికులు అతని కేసి చూడటం మానేశారు, అతన్ని కులవిందులకు ఆహ్వానించటం మానేశారు. పైపెచ్చు అతనూ, అతని భార్యా అంతులేని అవమానాలకు గురి కావలసి వచ్చింది. ఉదారమైన అతని మనస్సు విచారంతో నిండిపోయింది. అతనూ, అతని భార్యా ఒకప్పుడు సమస్త సౌఖ్యాలలోనూ ఓలలాడినవారేమో, వారికి దారిద్ర్యం మరింత దుర్భరంగా తోచింది. అతను స్వయంగా



కష్టాలు సహించగలిగినా, తన భార్య దారిద్ర్య బాధలకు గురి అవుతూంటే సహించలేకపోయాడు. ఆమె అమిత ఖరీదైన చీనాంబరాలు ధరించేది, రోజూ అంతులేని దానాలు చేసేది. అన్ని ఋతువులలోనూ ఆమెకు తట్టలకొద్దీ పూలు లభ్యంగా ఉండేవి. ఇప్పుడు ఇవేవీ లభ్యమయే మార్గంలేక ఆమె నిర్బంధంలో పెట్టిన ఏనుగులాగా బాధ పడసాగింది. తన భర్తను ఉత్సాహపరచటానికిగాను ఆమె తన బాధలు ఇతరులకు తెలియకుండా కప్పిపుచ్చటానికి చేసే వ్యర్థప్రయత్నాలు మరింత జాలి పుట్టించేవిగా ఉండేవి.

ఒక రాత్రి తన భార్య ఏదో ఇంటిపనిలో నిమగ్నురాలై ఉండగా, మణిభద్రుడు కటికమంచం మీద పడుకుని ఇలా ఆలోచించాడు:

''దారిద్ర్యం హేయమైనది. సజ్జనత్వం గాని, సౌశీల్యంగాని, సహనంగాని, సాధుత్వంగాని, కులీనతగాని దరిద్రుడిలో రాణించవు. మానమూ, దర్పమూ, విజ్ఞానమూ, అందమూ, వివేకమూ దారిద్ర్యంతో తుడిచిపెట్టుకుపోతాయి. ఏరోజుకారోజు ఎలా గడుస్తుందా అన్న ఆవేదనలో ఎంత తెలివిగలవాడి తెలివి అయినా సరే గడ్డకట్టుకుపోతుంది. ఒక ధనికుడి సామీప్యంలో వెయ్యిమంది దరిద్రులుండవచ్చు, కాని ధనికుడు తెలిసినట్టుగా లోకానికి ఆ దరిద్రులు తెలియరు. ప్రపంచానికి ధనం తప్ప మరేదీ పట్టదు. దరిద్రుడు చేస్తే నేరమయేది ధనికుడు చేస్తే కాదు. నాకీ జన్మవల్ల ప్రయోజనమేమిటి? నేను రేపు దూరంగా అరణ్యంలోకి వెళ్ళి, ఉరిపోసుకుని ఆత్మహత్య చేసుకుంటాను. నా శవాన్ని చూసి వేదనపడే అవసరం నా ప్రియ భార్యకు ఉండదు. నేను ధన సంపాదనకు ఏ దేశాంతరమో పోయాననుకుంటుంది. ఆ విధంగా ఆమెకు వైధవ్యం తాలూకు అగచాట్లు కూడా తప్పుతాయి. ఆమె తన



పుట్టింటికి వెళ్ళి, సుఖంగా జీవించవచ్చు; కాని నేను ఉండగా ఆమె ఆ పని చెయ్యదు. నేను లేకపోతే ఆమె వెళ్ళక తప్పదు.''

ఇలా అనుకుని మణిభద్రుడు నిద్ర పోయాడు. ఆ రాత్రి అతనికొక వింత కల వచ్చింది. కలలో ఒక దిగంబర జైనుడు కనిపించి, ''మణిభద్రా, ఆత్మహత్యా ప్రయత్నం మాను. గత జన్మలో చేసిన కర్మలు ఒక్కొక్కసారి ఫలించనట్టు కనిపించినా తప్పక ఫలిస్తాయి. క్రిందటి జన్మలో ఒక దిగంబర జైనముని పేదల కియ్యటానికి నిన్ను అర్థించగా నువు అతనికి లక్ష బంగారు మాడ లిచ్చావు. నేనే ఆ మునిని. నీ వద్ద తీసుకున్న ఆ బంగారం మూలంగా నేను శాపీనం పొంది, దాన్ని ఎవరికీ ఇయ్యక, పూర్వం లాగా దైవాన్నీ, ధర్మాన్నీ తలవక, బంగారాన్నే చూసి మురిసిపోసాగాను. మనసు దేనిమీద లగ్నమైతే అది అయిపోతా రంటారు. అది అక్షరాలా నిజమై, నేను పైకి మునిలాగా కనిపిస్తున్నా, బంగారు మనిషి నయాను. నాకిప్పుడు బుద్ధి వచ్చింది. బంగారం మీద కొంచెం కూడా కాంక్ష లేదు. అయినా ఈ బంగారు మనిషి నన్ను వదలడు. వాడు చావాలి. నీ బంగారం నీకు తిరిగి చెందాలి. కనక నేను రేపు ఉదయం ఇదే రూపంలో మీ ఇంటికి వస్తాను. నన్ను నువు సులభంగా గుర్తించగలవు. ఎందుకంటే నా చేతిలో భిక్షాపాత్ర ఉండదు. 'భిక్షాం దేహి!' అని అనను. నువు ఏ మాత్రమూ సంకోచించకుండా నా నెత్తిన కర్రతో కొట్టు. ఆ దెబ్బతో నేను రెండు మణుగులు బరువుగల బంగారు విగ్రహంగా మారిపోతాను. నువు నాకిచ్చిన బంగారం అంతే బరువు. ఆ బంగారంతో నువూ, నీ భార్యా వెనకటిలాగే సుఖంగా జీవించవచ్చు. కాకపోతే మధ్య వచ్చిన దారిద్ర్యంతో నువు మనుషులను గురించీ, లోకం గురించీ నిజం తెలుసుకుని, వివేకం పెంచు

కున్నావు. ఇక నేనేమో మామూలు జైనముని అయిపోయి, దేవలోకం చేరి, నిర్విఘ్నంగా తపస్సు చేసుకుంటాను," అని చెప్పి, అదృశ్యమైపోయాడు.

మణిభద్రుడు చప్పున నిద్రలేచి, ఈ వింత కల గురించి ఇలా అనుకున్నాడు:

''ఈ కల నిజమవుతుందో, లేదో తెలియదు. నేను నిద్రపోయే ముందు ధనం గురించే ఆలోచించాను గనక, బహుశా ఇది అర్థంలేని కలే అవుతుంది. జబ్బు పడినవాడూ, శోకతప్తుడూ, విచార గ్రస్తుడూ, ప్రేమికుడూ, తాగి మైకంలో ఉన్నవాడూ కనే కల ఎన్నడూ నిజం కాదంటారు. అయినా ఏం జరుగుతుందో చూతాం."

మణిభద్రుడు తెల్లవారకముందే లేచి, స్నానం చేసి, పూజ ముగించి, ఇంటి ముందు అరుగు మీద కూర్చున్నాడు. అతనికి సమీపంలోనే మంచి చేవగల కర్రతో చేసిన దుడ్డుకర్ర ఒకటి సిద్ధంగా ఉన్నది.

ఈ సమయంలో మంగలి ఒకడు వచ్చి, మణిభద్రుడి భార్య కాలి గోళ్ళు తీశాడు. ఆ పని పూర్తి అయే క్షణంలో ఒక జైనముని భిక్షాపాత్ర లేకుండా వచ్చి, భిక్ష అడగకుండా, మణిభద్రుడి కేసి నవ్వుతూ చూస్తూ నిలబడ్డాడు.

మణిభద్రుడు అతన్ని చూసి, తనకు కలలో కనిపించినవాడేనని తెలుసుకుని, చప్పున దుడ్డుకర్ర తీసుకుని జైనుడి నెత్తిన బలంగా ఒక్కటి పెట్టాడు. జైనముని విరుచుకు పడిపోయి, బంగారు విగ్రహంగా మారిపోయాడు. ఇది చూసి మణిభద్రుడి భార్యా, మంగలీ కూడా నిర్ఘాంతపోయారు.

మణిభద్రుడు ఆనంద బాష్పాలు రాల్చుతూ, తన భార్య సహాయంతో ఆ బంగారు విగ్రహాన్ని లోపలికి చేర్చి, ఆ విగ్రహం నుంచి చిన్న వేలు నరికి మంగలికి ఇచ్చి, ''ఒరే, బాబూ! దీనితో వినోదం జరుపుకో. కాని ఈ సంగతి మాత్రం ఎవరికీ చెప్పకు,'' అన్నాడు.






# 10

[ తలారి భల్లూకుడు, రాజు దుర్ముఖుడి తల నరక్కుండా, ఉగ్రదండుడు కాపాడి, అతణ్ణి మాంత్రికుడి దగ్గిరకు తీసుకువచ్చే బాధ్యత తన మీద పెట్టుకున్నాడు. ఆటవికుడు, తలారి భల్లూకుడి వెంట చంద్రశిలానగరం రావటానికి ఒప్పుకున్నాడు. ముందు పోతున్న తలారి భల్లూకుణ్ణి, ఏనుగుల మీద వచ్చిన నలుగురు అడ్డగించి, బాణాలు కొట్టసాగారు. తరవాత—]

తలారి భల్లూకుడు తన మీదికి వచ్చి పడుతున్న బాణాలను గండ్రగొడ్డలితో అడ్డి, ఎగిరి దూరంగా పోయి పడేలా కొడుతూ, మొండి తొండపు టేనుగును తనకు సమీపానికి వచ్చిన సైనికుల ఏనుగు పైకి తోలాడు. రెండు ఏనుగులూ ఒకదాని నొకటి ఎదుర్కొని, పెద్దగా ఘీంకరిస్తూ, తొండాలతో కొట్టుకుంటూ, దంతాలతో కుమ్ముకోబోయే సమయంలో, ''జై, దిరిసెనవన భైరవా!'' అంటూ గండ్రగొడ్డలిని, సైనికుడి ఏనుగు దంతాల పైకి విసిరాడు. గొడ్డలి దెబ్బకు ఏనుగు దంతం ఒకటి అరటి ఊచలా ఫెళ్ళుమంటూ తెగి, అంత దూరాన పోయి పడింది. ఈ గొడవలో ఆటవికుడు ఏనుగు మీది నుంచి కిందపడిపోయాడు.

దంతం విరిగిన ఏనుగు, భల్లూకుడి ఏనుగు ధాటికి తట్టుకోలేక వెనుదిరిగి



పారిపోబోయేంతలో, రెండవ ఏనుగు పైన వున్న సైనికులు ప్రాణ భీతితో పెద్దగా అరిచి, ''ఒరే, మనం ఏనుగు మీద వున్న వాడు, ఎలుగుబంటి వేషం వేసిన హాస్యగాడో, వీధిభాగవతుడో అనుకున్నాం. ఇదేదో యుద్ధవిద్యల్లు నేర్చిన నిజమైన ఎలుగుబంటులాగే వుంది,'' అంటూ తమ ఏనుగును అదిలించి, వెనక్కు తిప్పారు.

తలారి భల్లూకుడు దిమ్మెరపోయి కింద పడివున్న ఆటవికుడి కేసి ఒకసారి చూసి, తన వాహనాన్ని వేగంగా ముందుకు పరిగెత్తించి, పారిపోజూస్తున్న రెండు ఏనుగులనూ అడ్డగించి, ''ఒరే, నేను నిజమైన ఎలుగుబంటునే కాదు; తలలు నరకటమే వృత్తిగా గల తలారి భల్లూకుణ్ణి! కొంచెం సేపైనా మీ ప్రాణాలు నిలవాలంటే, పారిపోయే ప్రయత్నం మాని, నేనడిగేదానికి జవాబు లివ్వండి,'' అన్నాడు.

సైనికులు తలారి భల్లూకుడి రూపంతో పాటు, వాడి భీకరమైన కంఠ స్వరం కూడా విని, నిలువెల్లా వణికిపోసాగారు.

భల్లూకుడు తన మొండితొండపు ఏనుగును, సైనికుల ఏనుగుల చుట్టూ రెండుసార్లు గిర్రున తిప్పి, గండ్రగొడ్డలితో ఒక ఏనుగు తలను తాకి, సైనికులతో, ''ఒరే, ఇప్పుడు చెప్పండి. మీరెవరు? దుర్ముఖ మహారాజుకూ, జై అంటూ అరిచారు. ఆ రాజు తల నాకు తాకట్టులో వున్నది. ఒకవేళ మీరనే దుర్ముఖరాజు రాజ్యం పాలించేవాడు కాక, ఏదైనా పొలం పనులు చేసుకు బతికే అదే పేరు గలవాడా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సైనికుల్లో ఒకడు తల వంచి తలారి భల్లూకుడికి దణ్ణం పెట్టి, ''భల్లూక మహారాజా! మేం జేజేలు కొట్టిన రాజుగారు ఉదయగిరిని పాలించే దుర్ముఖులవారు. ఆయన్ని యీ అరణ్యంలో ఏనుగు వాహనం గల ఎవరో పట్టుకుని బంధించారని తెలిసి, వెతుక్కుంటూ యిటువచ్చాం,'' అన్నాడు.

ఆ జవాబుకు తలారి భల్లూకుడు ఆశ్చర్యపోతూ, "మీరనే అంత గొప్ప రాజును శత్రువుల నుంచి కాపాడేందుకు నలుగురంటే నలుగురు సైనికులు యింత మహారణ్యం ప్రవేశించారా?" అన్నాడు.

సైనికులు నలుగురూ వెలవెలపోతూ ఒకరి ముఖాలొకరు చూసుకోసాగారు. తలారి భల్లూకుడు యీసారి తన గండ్ర గొడ్డలిని దంతం తెగిన ఏనుగు తలపై ఆనించి, "ఒరే, నిజం చెప్పకపోయారో ముందు యీ ఏనుగు కుంభస్థలం, నా గండ్రగొడ్డలి దెబ్బకు రెండుగా చీలి పోతుంది. తరవాత మీ నలుగురి తలలకూ అదే ఖర్మ పట్టిస్తాను," అన్నాడు.

ఆ వెంటనే సైనికుల్లో ఒకడు, "భల్లూక మహారాజా! దుర్ముఖరాజుగారి కోటను, సూర్యభూపతి అనే సామంత రాజు ఆక్రమించాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో బతికి బయటపడిన మేము, రాజుగారిని వెతుక్కుంటూ యీ అరణ్య ప్రాంతాలకు వచ్చాం," అన్నాడు.

"ఒరే, మీ రాజభక్తి మెచ్చదగిందే! కాని, మీరెవరికోసం యింత శ్రమపడ్డారో, ఆ రాజు దుర్ముఖుడు, చంద్రశిలా నగరాన్ని ఆక్రమించాలని బయలుదేరి, దారిలో ఒక గొప్ప మాంత్రికుణ్ణీ, కాళీవర్మ అనే మహావీరుణ్ణీ అవమానించి చిక్కుల్లో



పడిపోయాడు. అతడు ప్రాణాలతో ఉదయగిరి నగరం చేరటం అసంభవం. మీరు పోయి మరే రాజు కొలువులోనైనా చేరండి," అన్నాడు తలారి భల్లూకుడు.

ఆ మాటలు అర్థంకాక సైనికులు ఆశ్చర్యపోతున్నంతలో, దుర్ముఖ రాజు అంగరక్షకుడు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, "తలారి భల్లూక ప్రభో! వెనక వస్తున్న మేమంతా ఏనుగుల ఘీంకారాలు విని, తమ మొండి తొండపు ఏనుగును ఏవైనా అడవి ఏనుగులు అడ్డగించి నయ్యేమో అనుకున్నాము," అంటూ నేలమీద భోర్లా పడివున్న ఆటవికుడి కేసి చూసి, "ప్రభో, తమ ఆటవిక సేవకుణ్ణి



ఏనుగులు తొక్కి చంపినట్టుందే!'' అన్నాడు.

తలారి భల్లూకుడు, ఆటవికుడి దాపులకు ఏనుగును నడిపి, ''వాడు చచ్చాడనుకోను, ఏనుగు కుంభస్థలం పైనుంచి పడ్డ పాటుకు మూర్ఛపోయి వుంటాడు. గట్టిగా వీపు మీద చరిచి చూడు,'' అన్నాడు.

అంగరక్షకుడు, ఆటవికుడి వీపు మీద అరచేతితో గట్టిగా కొడుతూ, ''మూర్ఛ నుంచి బయటపడు. నీ యజమాని పిలుస్తున్నాడు,'' అంటూ కేక పెట్టాడు.

ఆ వెంటనే ఆటవికుడు తుళ్ళిపడి లేచి, పక్కనే వున్న విల్లంబులను చేతికి తీసుకుంటూ, ''భల్లూకయ్యను అడ్డగించిన వాళ్ళెక్కడ?'' అంటూ సైనికుల కేసి బాణం ఎక్కుపెట్టాడు.

''అయ్యా, అంగరక్షకా! రక్షించు! రక్షించు!'' అంటూ సైనికులు ఏనుగుల మీదినుంచి కిందికి దూకేశారు.

అంగరక్షకుడు ఆశ్చర్యపోతూ సైనికుల కేసి పరీక్షగా చూసి, ''మీరా! నగరం వదిలి అరణ్యాని కెందుకొచ్చారు?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు తలారి భల్లూకుడు పెద్దగా నవ్వి, ''అదంతా పెద్ద కథ. మీ దుర్ముఖరాజు కోటను ఎవడో సామంతుడు ఆక్రమించేశాడు. అయినా, కొద్ది సేపట్లో తలనే పోగొట్టుకోపోతున్న వాడికి, రాజ్యం వుండి మాత్రం ప్రయోజనం ఏమిటి?'' అన్నాడు.

అంతలో అక్కడికి ముందు దుర్ముఖరాజూ, వెనకగా రాక్షసుడు ఉగ్రదండుడూ, అడవి దొంగలూ వచ్చారు. దుర్ముఖుడు వస్తూనే తన సైనికులను గుర్తించి, ''ఒరే, మీరీ అరణ్యాని కెందుకొచ్చారు?'' అని అడిగాడు.

సైనికులు జవాబివ్వబోయేంతలో తలారి భల్లూకుడు ఏనుగు మీదినుంచి దిగి, దుర్ముఖుడితో, ''దుర్ముఖా! ఇదే ప్రశ్న నీ అంగరక్షకుడూ వాళ్ళను

అడిగాడు. ఏమంత విచారించవలసిన సంగతి కాదు. నీ కోట సామంత రాజు వశమైపోయింది!'' అన్నాడు.

''ఎవడా సామంతుడు?'' అంటూ రాజు దుర్ముఖుడు కత్తి దూసి, సైనికులతో, ''నాకున్న సామంతు డొకడేకదా, సూర్యభూపతి! వాడే నా, కోట ఆక్రమించింది? కోటను మరొకళ్ళ పరంచేసి, పిరికిపందల్లా పారిపోయి వచ్చినందుకు, మీ తల లిప్పుడే నరకబోతున్నాను.'' అంటూ సైనికుల కేసి దూకబోయాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు చప్పున ఒకడుగు ముందుకు వేసి, దుర్ముఖుడి చేయి పట్టుకుని ఆపి, ''దుర్ముఖా, తొందర పడకు. ముందు తలారి భల్లూకుణ్ణుంచీ, మాంత్రికుణ్ణుంచీ నీ తల కాపాడుకునే ప్రయత్నం చెయ్యి. ఆ తరవాత నీ కోట, నీ వశమయేందుకు, మేం అందరం సాయం చేస్తాం.'' అన్నాడు.

ఆ మాటలతో దుర్ముఖుడు స్థిమిత పడి, ఉగ్రదండుడి రెండు చేతులూ పట్టుకుని, ''ఉగ్రదండ మహాప్రభో! నాకు చావే తప్పకపోతే, నన్ను రాజ్యం ఏలే రాజుగానే చావనివ్వండి. మీ సాయంతో దుష్టుడైన ఆ సామంతుడి తలను కోట బురుజుకు వేళ్ళాడదీసి, సంతోషంగా తల నరికించుకునేందుకు



ఆ భల్లూక మాంత్రికుడి దగ్గిరకు వస్తాను.'' అన్నాడు.

దుర్ముఖుడి దుఃఖం చూసి రాక్షసుడు ఉగ్రదండుడికి చాలా జాలి కలిగింది. అతడు తలారి భల్లూకుణ్ణి సమీపించి, ''ఏం, తలారి భల్లూకా! దుర్ముఖుడు కోరిందాంట్లో తప్పేంలేదు, అలాగే చేద్దామంటావా?'' అని అడిగాడు.

తలారి భల్లూకుడు రెండు మూడు క్షణాలపాటు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత అక్కడ వున్న వాళ్ళందరి కేసీ ఓసారి కన్నార్పకుండా చూసి, ''మీరందరూ కలిసి నన్ను మోసపుచ్చాలని చూడటం లేదుకదా?'' అంటూ వేళ్ళతో



గొడ్డలి పదునును పరీక్షించి చూడ సాగాడు.

భల్లూకుణ్ణి కోపంతో ఒళ్ళు మరిచిపోక ముందే శాంతపరచటం మంచిదని, ఉగ్రదండుడు చిరునవ్వు నవ్వుతూ అతడి భుజం మీద చేయి వేసి, "తలారి భల్లూకా, నీ గండ్రగొడ్డలి పదు నెలాంటిదో మేం అందరం ఎరిగిందే! భల్లూక మాంత్రికుడు తెమ్మన్న తల, రాజు దుర్ముఖుడిదా లేక రాజ్యం పోగొట్టుకున్న దుర్ముఖుడిదా?" అని అడిగాడు.

తలారి భల్లూకుడు ఆ ప్రశ్న అర్థం కాని వాడిలా విసుగ్గా తలాడిస్తూ, "ఉగ్ర దండా, నువ్వేదో మడత పేచీ మాటలతో, ధర్మ సందేహాలేవో రేపుతున్నట్టున్నది. అవునా? చెప్పదలిచిందేమిటో సూటిగా చెప్పు." అన్నాడు.

"అయితే విను, భల్లూకా! ఈ దుర్ముఖ రాజును రానున్న ప్రాణగండంకన్న, పోయిన రాజ్యాన్ని గురించిన చింత ఎక్కువగా బాధిస్తున్నది. కనక, ద్రోహి అయిన ఆ సామంతు సూర్యభూపతిని కోటలోనుంచి వెళ్ళగొట్టి, లాంఛన ప్రాయంగా కోటా, దానితోపాటు ఉదయ గిరిరాజ్యం రాజు దుర్ముఖుడిదే అనిపించి, ఆ తరవాత అతణ్ణి మాంత్రికుడి దగ్గిరకు తీసుకుపోదాం," అన్నాడు.

రాజు దుర్ముఖుడు చేతులు రెండూ జోడించి, "తలారి భల్లూక ప్రభో! కొద్ది గంటల కాలంలో యీ లోకం విడవనున్న, నా ఆఖరి కోర్కెను కాదనకండి," అన్నాడు.

తలారి భల్లూకుడు అంగీకార సూచకంగా తలాడించేంతలో, ఆటవికుడు అంబు నొకదాన్ని చెట్టు బోదెకు ఠక్ మంటూ తగిలేలా వదిలి, "ఆహాఁ, భల్లూకయ్యా, ఆ సామంతును నా బాణం దెబ్బకు వదలండి. అరణ్యంలో వేటాడి బతికే నాబోటివాళ్ళనుంచి కొట్టిన పిట్టకూ, జంతువుకూ, వాడు పన్ను వసూలు చేశాడు," అన్నాడు.

ఆ వెంటనే దొంగల - నాయకుడు నాగమల్లు కత్తి దూసి పైకెత్తి పట్టుకుని, "ఆ సూర్యభూపతి అనే సామంతు, అన్నిటికీ తెగించి అరణ్యంలో దారులు కొట్టుకుని బతికే మానుంచి కూడా, దోపిడీ సొమ్ములో సగభాగం వసూలు చేసుకు రమ్మని తన సైనికుల్ని పంపుతూండేవాడు. ఆ దుర్మార్గుడితో పోల్చితే, యీ దుర్ముఖ రాజుగారు ధర్మరాజంతవారు," అన్నాడు.

"పదండి! ఇంతకూ ఆ ఉదయగిరి నగరం ఎంత దూరంలో వున్నది?" అన్నాడు తలారి భల్లూకుడు.

"అడ్డ దారిన అంతా అరగంట ప్రయాణం. నే ముందుండి దారి తీస్తాను. మన మొండితొండపు ఏనుగు కుంభస్థలం మీద ఎక్కి కూర్చోమని సెలవా, తలారి భల్లూకయ్యా?" అన్నాడు ఆటవికుడు.

తలారి భల్లూకుడు సరే అంటూ తల వూపి, ఏనుగు పైన ఎక్కి కూర్చున్నాడు. రాక్షసుడు ఉగ్రదండుడు, రాజు దుర్ముఖుణ్ణి భుజాలు పట్టుకుని పైకెత్తి, దంతం విరిగిన ఏనుగు పైన కూర్చోబెడుతూ, భల్లూకుడితో, "తలారి భల్లూకా, నీ అనుమతితో దుర్ముఖుణ్ణి ఏనుగు మీద ఎక్కిస్తున్నాను. కొద్ది క్షణాలపాటైనా తిరిగి రాజు కానున్నవాడికి, ఆ మాత్రం మర్యాద అవసరంగదా!" అన్నాడు.



రాజు దుర్ముఖుడితో పాటు యిద్దరు సైనికులు ఒక ఏనుగు మీదా, దొంగల నాయకుడు నాగమల్లూ, అతడి అనుచరులూ, మిగిలిన ఇద్దరు సైనికులూ మరొక ఏనుగు మీదా ఎక్కి, ఆటవికుడు దారి తీయగా అందరూ ఉదయగిరి నగరం కేసి బయలుదేరారు. రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగదను భుజాన పెట్టుకుని పెద్ద పెద్ద అంగలు వేస్తూ, వాళ్ళ వెనకగా నడవసాగాడు.

అరగంట తరవాత అరణ్యం దాటి వాళ్ళు ఒక పెద్ద మైదాన ప్రదేశంలో ప్రవేశించారు. ఎదురుగా ఒక పెద్ద కోటా, దానికి వెనకగా మేడలూ, మిద్దెలతో

నగరం వాళ్ళ కంటబడింది. కోటను చూస్తూనే రాజు దుర్ముఖుడు విచారంగా ముఖం పెట్టి, తలారి భల్లూకుడితో, ''భల్లూక ప్రభో! ఆ సామంతు దుర్మార్గుడి దగ్గిర యిప్పుడు కొంత అశ్వసేనా, కాల్బలం వుంటుందిగదా? అంత సేనను, మనమంతా కలిసి పదిమందిమైనా లేము —ఎలా జయించటం?'' అన్నాడు.

''ఆహాఁ, ఆ అనుమానం యిప్పుడా నీకు కలగటం!'' అంటూ తలారి భల్లూకుడు వెనక వస్తున్న ఉగ్రదండుణ్ణి కేకవేసి పిలిచి, దుర్ముఖుడి క్కలిగిన సందేహాన్ని గురించి చెప్పాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగదను గట్టిగా నేలకు కొట్టి, ''తలారి భల్లూకా! నీ గండ్రగొడ్డలీ, నా రాతిగదా ఎంతమంది శత్రుసైనికులనైనా హతమార్చగలవు. కాని, ఎక్కువ రక్తపాతం లేకుండా, ఆ కోట నాక్రమించిన సామంతుణ్ణి పట్టుకుని తలకొట్టే పథకం ఏదైనా వుంటే బాగుండును.'' అన్నాడు.

ఉగ్రదండుడు మాట ముగించే లోపలే దొంగ నాగమల్లు ఏనుగు మీద లేచి నిలబడి, ''అయ్యా, అలాంటి పథకం గురించి యిందాకటినుంచీ నేనాలోచిస్తూనే వున్నాను. నేనూ, నా అనుచరులిద్దరం ముందు పోయి, దుర్ముఖరాజు గారిని బందీగా పట్టుకొస్తున్నాం, ఏం బహుమతి యిస్తారని, ఆ సామంతును అడుగుతాం. అప్పుడు అతడే స్వయంగా కొద్దిమంది అంగరక్షకులతో మన దగ్గిరకు రావచ్చు,'' అన్నాడు.

''ఓఁ, భేషైన ఉచ్చు అల్లావు, నాగమల్లూ! ఊఁ, బయలుదేరు,'' అన్నాడు ఉగ్రదండుడు.

దొంగల నాయకుడు నాగమల్లూ, అతడి అనుచరులూ ఏనుగును దౌడు తీయిస్తూ, కోట కేసి కొద్ది దూరం వెళ్ళే సరికి, హఠాత్తుగా కోట ద్వారం బార్లా తెరుచుకున్నది. లోపలినుంచి బిలబిలమంటూ కొందరు అశ్వికులూ, సైనికులూ బయిటికి వచ్చారు. —(ఇంకా వుంది)





# సైనికుడి ప్రవర్తన

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఈ విధంగా శ్రమపడుతున్నది ఎవరైనా మిత్రుడి కోసం అయితే, మిత్రుల ఔదార్యం నమ్మదగినది కాదని తెలుసుకో. అందుకు నిదర్శనంగా నీకు కుమారవర్మ యొక్క దుష్ప్రవర్తన గురించి చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

కౌంశాంబీ నగరానికి చెందిన కుమారవర్మ అనే క్షత్రియ యువకుడు అనేక దేశాలలో కిరాయి సైనికుడుగా పనిచేసి; చాలా ధనం సంపాదించాడు. అప్పుడు అతనికి స్వదేశం మీద గాలి మళ్ళింది. కౌశాంబీ నగరానికి వెళ్ళి, యోగ్యురాలైన

## బేతాళ కథలు



భార్యను పెళ్ళాడి, తాను సంపాదించిన డబ్బుతో సుఖంగా జీవించదలచి కుమార వర్మ బయలుదేరాడు.

దారిలో కుమారవర్మకు ధనగుప్తుడు అనే వర్తకుడు కలిశాడు. ధనగుప్తుడిది కూడా కౌశాంబీయే. అతను సుప్రసిద్ధుడైన వర్తకుడు; కోటీశ్వరుడు. ధనగుప్తుడి వెంట అతని కుమారుడు నందగుప్తుడు కూడా ఉన్నాడు. నందగుప్తుడు తన తండ్రి వెంట దేశాలు తిరిగి, వర్తకసరళి నేర్చుకోవటం అదే మొదటిసారి. కొడుకును చాలా తిప్పి ఉండటంచేత ధనగుప్తుడు, తనకు ఇంకా తిరగాలని ఉన్నా, కొడుకు కోసం కౌశాంబీకి తిరిగి పోదామనుకుంటూండగా కుమారవర్మ తటస్థపడ్డాడు.

కుమారవర్మ ఆరితేరిన యోధుడు. అతను కూడా కౌశాంబీకే పోతున్నాడు. అందుచేత, ధనగుప్తుడు తన కొడుకును కుమారవర్మకు అప్పజెప్పి, తాను మరి కొన్ని దేశాలలో వర్తకం చేసేందుకు బయలుదేరుతూ, కొడుకుకు కొంత ధనం ఇచ్చాడు.

కుమారవర్మతో బాటు నందగుప్తుడు కౌశాంబీకి బయలుదేరాడు. మధ్యదారిలో వారికి ఒక నగరం తగిలింది. ఆ ప్రాంతంలో వజ్రాలగనులు ఉండటం చేత అక్కడ వజ్రాలు చౌక. అక్కడ వజ్రాలు కొని కౌశాంబీలో మంచి ధరకు అమ్మవచ్చుననుకుని, నందగుప్తుడు, కుమారవర్మను వెంటబెట్టుకుని వజ్రాల వర్తకుల వద్దకు వెళ్ళి, వజ్రాలు బేరం చేశాడు.

నందగుప్తుడికి తండ్రి ఇచ్చిన డబ్బుతో నాలుగు వజ్రాలు మాత్రమే కొనటానికి వీలు అయింది.

"మా తండ్రి వద్దనుంచి ఇంకా ఎక్కువగా డబ్బు తీసుకుని ఉంటే ఇంకా ఎక్కువగా వజ్రాలు కొని మరింత లాభం పొంది ఉందును గద!" అన్నాడు నందగుప్తుడు బాధగా

"నీకు కావాలంటే నా దగ్గిర డబ్బున్నది. దారిలో నాకు అది ఎలాగూ ఉపయోగపడదు. దానితో వచ్చినన్ని వజ్రాలు కొనుక్కుని, కౌశాంబీ వెళ్లినాక వాటిని అమ్మి, నా డబ్బు నాకు ఇచ్చెయ్య వచ్చు." అన్నాడు కుమారవర్మ ఉదారంగా.

కుమారవర్మ వద్ద ఉన్న డబ్బు అరువు తీసుకుని, దానితో నందగుప్తుడు మరి నాలుగు వజ్రాలు కొనుక్కున్నాడు. వాళ్లు ముందుకు సాగారు.

కౌశాంబీకి ఇంకా ఒక్క రోజు ప్రయాణం ఉందనగా వాళ్ళు ఒక అడవి ప్రవేశించారు. అనుకున్న ప్రకారం చీకటి పడేలోపుగా వారు అడవి దాటలేక పోయారు.

ఆ రాత్రి వాళ్ళు అడవిలోనే గడప వలసిన పరిస్థితి వచ్చింది.

నందగుప్తుడికి పెద్ద భయం పట్టుకున్నది. ఆ అడవి దొంగలకు ప్రసిద్ధి. తన వద్ద ఎనిమిది వజ్రాలున్నాయి. దొంగలు వాటిని దోచుకుంటే, తన డబ్బు పోవటం మాట అటుంచి, తాను కుమారవర్మకు నిష్కారణంగా బాకీ చెల్లించుకోవలసి వస్తుంది. కుమారవర్మ వద్ద కత్తి ఉన్నది, కాని అతను తనను దొంగల బారి నుండి కాపాడటానికి అతని ప్రాణం అడ్డు వేస్తా



డని ఏమిటి? అతని డబ్బుతో తాను వజ్రాలు కొని ఉండటం చేత, అతని దగ్గర దొంగలు దోచుకునేటందుకైనా ఏమీ లేదు! కుమారవర్మకు తాను బాకీ పడకుండా చూసుకోవటం కన్న నంద గుప్తుడికి మరో దారి కనిపించలేదు. అతని వజ్రాలు అతనికి ఇస్తే వాటికోసమైనా అతను దొంగలతో పోరాడవచ్చు. ఆ విధంగా తాను కూడా లాభం పొంద వచ్చు.

ఇలా అనుకుని నందగుప్తుడు కుమార వర్మతో, "వర్మా, నీ డబ్బుతో వజ్రాలు కొని, వాటి మీద నేను లాభం పొందటం చాలా అన్యాయమనిపిస్తున్నది. నా అంత



రాత్మ అందుకు ఒప్పుకుండా ఉన్నది. నీ వజ్రాలు నువే తీసుకుని, కౌశాంబీలో అమ్ముకుని, ఆ లాభం నువే ఉంచుకో," అంటూ నాలుగు వజ్రాలు తీసి కుమార వర్మకు ఇచ్చేశాడు.

నందగుప్తుడు ఏ ఉద్దేశంతో ఇలా చేశాడో, కుమారవర్మకు అర్థమయింది. అతను నందగుప్తుడితో, "నా దగ్గిర ఈ వజ్రాలుండటంచేత నాకు దొంగల భయం ఉన్నది. నన్ను నేను రక్షించుకుంటాను. నిన్ను నువు రక్షించుకో. నేను నిన్ను రక్షించగలనని మాట ఇయ్యలేను," అంటూ, తన గుర్రాన్ని ఎక్కి వెళ్ళిపోబోయాడు.

నందగుప్తుడు చాలా భయపడి, తనను విడిచిపెట్టి పోవద్దని కుమారవర్మను బతిమాలాడు.

"ఒక షరతు మీద నిన్ను కౌశాంబీకి క్షేమంగా చేర్చే బాధ్యత నేను వహిస్తాను. అందుకు ప్రతిఫలంగా నీ వజ్రాలలో రెండు నాకివ్వవలసి ఉంటుంది," అన్నాడు కుమారవర్మ.

నందగుప్తుడు ఒప్పుకున్నాడు. ఆ రాత్రి క్షేమంగానే గడిచింది. మర్నాడు తెల్లవారగానే వారు బయలుదేరి, ఆ రోజు చీకటి పడేలోగా కౌశాంబీ చేరుకున్నారు. నందగుప్తుడు తన నాలుగు వజ్రాలలో రెండు కుమారవర్మకు ఇచ్చుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కుమారవర్మ దుష్ప్రవర్తనను ఏమనాలి? నందగుప్తుడు స్వార్థపరుడు కావచ్చు! కాని అతనిది వర్తకుడికి సహజమైన స్వార్థం. అతను కుమారవర్మకు ఎలాటి ద్రోహమూ తలపెట్టలేదు; అతని డబ్బుతో కొన్న వజ్రాలు అతనికి తిరిగి ఇచ్చి, వాటి పూచీ తనకు లేకుండా చేసుకున్నాడు. కుమారవర్మ వద్ద ధనం ఉండి ఉంటే అతనికి దొంగల భయం ఎంత ఉండేదో, వజ్రాలు ఉన్నందున అంత కన్న ఎక్కువ ఉండదు. అందుచేత నందగుప్తుడి ప్రవర్తనలో వంకపెట్టటానికి

లేదు. కుమారవర్మ అలా కాదే! నందగుప్తుణ్ణి రక్షిస్తానని అతని వజ్రాలలో సగం కాజేశాడు. ఇది అధర్మం కాదా? వజ్రాలు కొనటానికి గాను కుమారవర్మ నందగుప్తుడికి తన డబ్బు ఇయ్యటంలో కనిపించిన ఔదార్యం కపటమైనది కాదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగులుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఇందులో నందగుప్తుణ్ణి గాని, కుమారవర్మను గాని మెచ్చుకునేటందుకూ, తప్పు పట్టటానికీ ఏమీ లేదు. ఎవరి వృత్తిధర్మం వారు అనుసరించారు. కుమారవర్మ తన డబ్బు నందగుప్తుడికి ఇయ్యటంలో ఔదార్యం ఏమీ లేదు. తక్కువ ధరలో కొని ఎక్కువ ధరకు అమ్మటం కుమారవర్మ వృత్తిధర్మం కాదు. కౌశాంబీ చేరినదాకా తనకు తన డబ్బుతో పనిలేదని అతను చెప్పనే చెప్పాడు. కుమారవర్మ వద్ద డబ్బు తీసుకున్న నందగుప్తుడు అతనికి వజ్రాల రూపంలో తిరిగి ఇచ్చి, లాభం చేసుకోమనటం సబబు కాదు. అతను అటాటి పని చేయదలిస్తే, నందగుప్తుడి వెనక తానే నాలుగు వజ్రాలు కొనుక్కునేవాడు. నందగుప్తుడి ప్రవర్తన కుమారవర్మకు చీకాకు కలిగించింది. అతను నందగుప్తుణ్ణి క్షేమంగా ఇంటికి చేర్చటానికి ప్రతిఫలం అడిగితే అది అతని వృత్తిధర్మమే గాని, మరొకటి కాదు. అతను సంపాదించిన డబ్బంతా అలాగే సంపాదించాడు. కుమారవర్మ తనను రక్షించగలిగి కూడా రక్షించడనుకోవటంలో కూడా నందగుప్తుడు తన సంకుచితబుద్ధి బయట పెట్టాడు. అతని వృత్తి నుంచే అలాటి సంకుచితబుద్ధి ఏర్పడింది. స్వార్థం చూసుకోకుండా ఎవరూ ఇతరులకు సాయపడరన్నది వర్తకుడి దృక్పథం.'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —[కల్పితం]





# సన్మానం

పాంచాల దేశానికి ఒక్కసారిగా రెండు బెడదలు వచ్చిపడ్డాయి. ముందు పొరుగు దేశంతో యుద్ధం జరిగింది. అందులో జయాపజయాలు ఎవరివీ కాలేదు. సంధి జరిగింది. అయితే ఖజానా చాలావరకు ఖాళీ అయింది. ఈ పరిస్థితిలో వర్షాలు కురవక, క్షామం ఏర్పడింది.

పాంచాల రాజు సుధీరుడికి ఏమీ చెయ్యటానికీ పాలుపోలేదు. కొందరు హోమాలూ, యజ్ఞాలూ చెయ్యమన్నారు. ఖజానాలో ధనం తక్కువగా ఉండటం చేత ఆయనకు ఈ పద్ధతి నచ్చలేదు. అయితే ఒక సభికుడు మరొక సూచన చేశాడు. ఆ దేశంలో ఒక వైణికుడు ఉన్నాడట. ఆయన పేరు దీపకుడు. ఆయనకు ఆ పేరు ఎందుకు వచ్చిందంటే, ఆయన వీణ మీద దీపకరాగం వాయిస్తే, దీపాలు వాటంతట అవే వెలుగుతాయట. అలాటి శక్తిమంతుడు మేఘమల్హార్ రాగం వాయిస్తే వానలు కురవవచ్చునేమో!

ఈ వార్త విని రాజు ఆశ్చర్యపోయి, అలాటివాడి శక్తి సామర్థ్యాలు తప్పక చూడాలనుకున్నాడు. రాజూ, మంత్రీ మారువేషాలు ధరించి, ఆ రాత్రే దీపకుడు ఉండే గ్రామానికి బయలుదేరి, మర్నాడు ఉదయం దీపకుడి ఇల్లు చేరుకున్నారు. వాళ్ళు వెళ్ళేసరికి దీపకుడు తన ఇంట్లో సరస్వతీదేవికి ఎదురుగా కూర్చుని, వీణ మీద దీపకరాగం వాయించటం ప్రారంభించాడు. కొద్దిసేపట్లో సరస్వతీదేవి విగ్రహం ముందు దీపాలు వెలిగాయి. తరవాత దీపకుడు సరస్వతీదేవిని పూజించనారంభించాడు.

ఇది కళ్ళారా చూసిన రాజూ, మంత్రీ నిర్ఘాంతపోయారు. దీపకుడు పూజ పూర్తి చేసినాక రాజుకేసి తిరిగి, ''నావల్ల మీకు

మోదుకూరి జతీంద్రశర్మ

ఏం పని కావలసి ఉన్నది, మహారాజా ?" అని అడిగాడు.

రాజు ఆశ్చర్యపడి. ''నన్ను గుర్తించావన్నమాట!'' అన్నాడు.

''లోగడ తమరిని చూశాను. నాతో పని ఉన్నట్టయితే, కబురుచేస్తే నేనే వచ్చి ఉండేవాణ్ణి.'' అన్నాడు దీపకుడు.

''నీ ప్రతిభను, దేశం కోసం వినియోగించరాదా?" అన్నాడు రాజు.

''ఎలా వినియోగించమన్నారు?'' అని దీపకుడు అడిగాడు.

''దీపకరాగంతో దీపాలు వెలిగించిన వాడివి మేఘరాగంతో వర్షం కురిపించలేవా ? దేశంలో నీటి కరువు ఏర్పడింది," అన్నాడు రాజు.

దీపకుడు ఆశ్చర్యంగా, ''ఆ పని నా వల్ల అవుతుందా? నేను మేఘరాగంతో వర్షం కురిపించటానికి ఎన్నడూ ప్రయత్నించలేదు.'' అన్నాడు.

''ఇప్పుడు ప్రయత్నించరాదా ?'' అన్నాడు రాజు.

దీపకుడు వారం రోజులు గడువు అడిగి, రాజునూ, మంత్రినీ పంపేశాడు. తరవాత అతను వారం రోజులూ సరస్వతిని ఆరాధించి, ఆఖరు రోజున సమీపంలో ఉన్న పర్వతం మీదికి వీణతో సహ వెళ్ళాడు.



దీపకుడు శిఖరం మీద కూర్చుని, వీణ మీద మేఘరాగం వాయించసాగాడు. కొద్దిసేపట్లో అన్ని వైపులనుంచీ మేఘాలు కమ్ముకుని రాసాగాయి. క్రమంగా వర్షం ప్రారంభమై, కుంభవృష్టిగా మారింది. వట్టిపోయిన బావులూ, చెరువులూ నిండాయి.

తరవాత రాజు దీపకుణ్ణి తన సభకు పిలిపించి, అతనికి పెద్ద ఎత్తున సన్మానం తలపెట్టాడు. అయితే దీపకుడు సన్మానం పొంద నిరాకరించి, రాజు వద్ద సెలవు పుచ్చుకుని, తన ఇంటికి వెళ్లిపోయాడు.

కొంతకాలం గడిచింది. ఒకనాడు సుధీరుడి ఆస్థానానికి దూరదేశం నుంచి

ఒక వైణికుడు వచ్చి, "రాజా, నా పేరు మైనాకుడు. మీ దేశంలో దీపకు డనే వైణికుడున్నాడనీ, అయన తన వీణను సంగీతం కోసం కాక, గారడీవిద్యలకు ఉపయోగిస్తున్నాడనీ విన్నాను. నాకు గారడీలోనూ, హస్తలాఘవంలోనూ నమ్మకం లేదు. మూఢప్రజలు గోరంతలు కొండంతలు చేస్తారు. మీ దీపకుడితో నేను సంగీతంలో పోటీ చేయదలచాను. నాకు అవకాశం ఇప్పించండి," అని అడిగాడు.

దీపకుడికి కబురు వెళ్లింది. మైనాకుడితో పోటీ చెయ్యటానికి దీపకుడు ఒప్పుకుని వచ్చాడు. ముందు మైనాకుడు వాయించాడు. తరవాత అదే రాగాన్ని దీపకుడు వాయించాడు. మైనాకుడు అతని కాళ్ళ మీద పడిపోయి, "సరస్వతీ పుత్రుడివి! నిన్ను గారడీ వాడనుకుని అపచారం చేశాను!" అని క్షమాపణ చెప్పుకున్నాడు.

దీపకుడికి సన్మానం చెయ్యటానికి ఇలాటి అవకాశం మళ్ళీ రాదని సభికులు రాజును ఎగదోశారు. దీపకుడు సన్మానాలకు ఒప్పుకోడనుకుని రాజు సందేహించాడు. కాని తీరా అడిగితే దీపకుడు అందుకు ఒప్పుకున్నాడు.

"దేశాన్ని కరువునుంచి కాపాడినప్పుడు కూడా సన్మానం చేస్తానంటే ఒప్పుకోని వాడివి ఇప్పుడు ఎలా ఒప్పుకున్నావు?" అని రాజు దీపకుణ్ణి ఆశ్చర్యంగా అడిగాడు.

"మహారాజా, నేను స్వశక్తితో వర్షం తెప్పించానని ఏనాడూ అనుకోలేదు. నేను మేఘ రాగం పాడటమూ, వర్షం కురవటమూ కాకతాళీయం కావచ్చు. అలా కాక అందులో ఎవరి శక్తి అయినా ఉంటే అది సరస్వతీ దేవిది. ఆమె అనుగ్రహం నా పైన ఉండటమే నాకు గొప్పసన్మానం. అందుకు వేరే సన్మానం ఏమని చేయించుకోను? ఇప్పుడు నేను కేవలం వీణావిద్వాంసుడుగా సాటి విద్వాంసుడి పైన విజయం సాధించాను. సన్మానం చెయ్యండి, చేయించుకుంటాను," అన్నాడు దీపకుడు.





# రంగులుమారే హారం

అనేక వేల సంవత్సరాల క్రితం ఒక అడవిలో కాలాసురుడు అనే రాక్షసుడు ఉండేవాడు. వాడు నరభక్షకుడు. ఒక పర్యాయం వాడికి ఒక మునీశ్వరుడు దొరి కాడు. ఆ మునీశ్వరుడు వాడితో, "ఓరీ, నన్ను తినడంవల్ల నీ ఆకలి తీరదు. నా తపశ్శక్తితో నిన్ను చంపగలనుగాని, అందువల్ల నేను మళ్ళీ వంద ఏళ్లు తపస్సు చేయవలసి ఉంటుంది. కిందటి జన్మలో ఎంతో పాపం చేసుకుని ఈ రాక్షస జన్మ ఎత్తావు. నన్ను వదిలిపెట్టావంటే నీకు ఇంత పుణ్యం కూడా వస్తుంది," అన్నాడు.

కాలాసురుడు కాస్సేపు ఆలోచించి, "ఈ రాక్షసజన్మ పోవడానికి ఏం చేయాలో చెప్పండి," అని అడిగాడు.

మునీశ్వరుడు తనలో ఇలా ఆలోచించాడు: "వీడు రాక్షస జన్మ ఎత్తాడు గనక, మనుషులను తినడం మానమంటే మానడు. అయితే ఈ కలిలో నిజమైన పుణ్యాత్ములు దాదాపు లేరనే చెప్పాలి. అందుచేత పుణ్యాత్ములను మాత్రమే తినాలంటే వీడు తప్పనిసరిగా నరభక్షణ మానవలసివస్తుంది."

ఇలా అనుకుని ముని రాక్షసుడితో, "నువు మనుషులను తినడంలో విచక్షణ చూపడంలేదు. మనుషులలో పుణ్యాత్ములుంటారు, పాపాత్ములుంటారు. కుళ్లిన ఆహారం తినడం వంటికి ఎలా చెరుపో, పాపాత్ములను తినడం అలాగే చెరుపు. వాళ్ళ పాపం నీలో చేరిపోతుంది. అందుచేత నువు పుణ్యాత్ములను మాత్రమే తింటూ, పుణ్యం నీలో చేర్చుకో. ఎవరు పుణ్యాత్ములో, ఎవరు పాపాత్ములో తెలియగలందులకు నేను ఒక హారం ఇస్తాను. దాన్ని మెడలో వేసుకుని నువు

మనిషిని తాకినప్పుడు వాడు పుణ్యాత్ముడైతే హారం పచ్చగా మారుతుంది, పాపాత్ముడైతే ఎర్రగా మారుతుంది,'' అని చెప్పి, తన మెడ నుంచి ఒక తెల్లని పూసలు గల హారం తీసి రాక్షసుడికి ఇచ్చాడు.

రాక్షసుడు దాన్ని తన మెడలో వేసుకుని, మునిని పట్టుకుని, ''నువు పుణ్యాత్ముడివే గదా, ఇప్పుడు నిన్ను తింటాను,'' అన్నాడు. అయితే వాడు మునిని తాకగానే హారం పచ్చగా మారటానికి బదులు ఎర్రగా మారింది. వాడు మునిని వదిలిపెట్టాడు.

''నేను రాక్షసుడికి ఇచ్చిన సలహాతో నా పుణ్యం అంతా పోయి, పాపం చుట్టుకున్నట్టున్నది. పొరపాటు చేసినట్టున్నాను,'' అనుకుంటూ ముని తన ఆశ్రమానికి వెళ్లాడు. తరవాత ఆయన తన మనస్సును దేనిమీదా కేంద్రీకరించలేకపోయాడు. ఎన్నో ఏళ్ళు తాను చేసిన తపస్సు వ్యర్థమైపోయింది. ఇలా ఎందుకు జరిగిందో తెలుసుకుందామని ఆ ముని, మరొక అరణ్యంలో తపస్సు చేసుకుంటున్న తన గురువు వద్దకు వెళ్ళాడు.

''నీ అనుమానం తీర్చగలవాడు ఒక్కడే ఉన్నాడు, అతని పేరు చిరంజీవి. ప్రస్తుతం విష్ణుపురంలో ఉంటున్నాడు. అతని వద్దకు వెళ్లు,'' అన్నాడు గురువు.

ముని విష్ణుపురం వెళ్ళి, చిరంజీవిని చూశాడు. చిరంజీవి సామాన్య మానవు



డిలా జీవిస్తున్నాడు. అలాటివాడు తనకు తోడ్పడతాడన్న నమ్మకం లేకపోయినా, ఎంతో జ్ఞాని అయిన తన గురువు చెప్పాడు గనక. ముని తన గొడవ అంతా చిరం జీవికి చెప్పాడు.

చిరంజీవి అంతా విని, "మీరు తపస్సు చేసి పుణ్యం పెంచుకున్నారేమో గాని, తెలివి పెంచుకున్నట్టు లేదు. మిమ్మల్నే తినబోయిన ఆ రాక్షసుడు ఎంత దుర్మార్గుడో చూశారు గదా. లోకంలో ఉన్నది కొద్దిమంది పుణ్యాత్ములే అయినప్పుడు, ఆ కొద్దిమందినీ వాడు తినేస్తే, లోకం పాపాత్ములతో నిండి పోదా? లోకాన్ని కాపాడటానికి కొద్దిమంది పుణ్యాత్ములే చాలు. ఒక్క సూర్యుడు ప్రపంచాని కంతకూ జీవం ఇస్తున్నాడు కాదా?" అన్నాడు.

"అయితే నా వల్ల పెద్ద పొరపాటే జరిగిపోయిందన్న మాట!" అన్నాడు ముని.

"అందుకు మీరేమీ బాధపడనవసరం లేదు. రాక్షసుడి వద్దకు వెళ్ళి, మీరు పొరపాటు చెప్పినట్టు చెప్పండి," అన్నాడు చిరంజీవి.

"వాడు నా మాట నమ్ముతాడా?" అన్నాడు ముని.

"మీ సలహా తప్పని వాడితో అనవద్దు. రంగు విషయంలో పొరపాటు చెప్పినట్టు చెప్పండి. ఆత్మరక్షణ కోసం అబద్ధం చెప్పాననండి," అన్నాడు చిరంజీవి.



మునీశ్వరుడు మళ్ళీ రాక్షసుడి వద్దకు వెళ్ళాడు.

"నీ సలహా నా కొంప ముంచింది. మనుషుల్లో పుణ్యాత్ములు ఉన్నట్టు లేరు. ఇప్పటివరకూ నాకు ఒక్కడూ తగల లేదు." అన్నాడు రాక్షసుడు మునితో.

వాడు తన సలహా పాటిస్తున్నందుకు ముని సంతోషించి, "మనుషుల్లో పాపాత్ముల కన్న పుణ్యాత్ములే ఎక్కువ. మనిషి జన్మ ఉత్తమోత్తమమైనదిగద. నన్ను రక్షించుకోవడంకోసం నీకు రంగు విషయంలో అబద్ధం చెప్పాను. నిజానికి పుణ్యాత్ములను తాకితే హారం ఎర్రగా మారుతుంది. ఈ విషయం చెబుదామనే వచ్చాను." అన్నాడు.

"ఈ మాట నిజమేనా?" అంటూ రాక్షసుడు కోపంగా మునిని పట్టుకున్నాడు. వాడు తనను తాకగానే హారం ఎరుపు రంగుకు మారుతుందనీ, వాడు తనను తినేస్తాడనీ మునికి తెలుసు. అయినా పొరపాటును సరిదిద్దుకునేటందుకు తన ప్రాణాలుపోయినా ఫరవాలేదని ఆయన అనుకున్నాడు.

అయితే ఆయన ఊహించని విధంగా హారం పచ్చరంగుకు మారింది.

"ఇదేమిటి?" అన్నాడు రాక్షసుడు ఆశ్చర్యంగా.

"నిన్ను పుణ్యాత్ముల మీదికి పంపుతున్నాను గదా, ఆ పాపం నాకు చుట్టుకున్నది." అన్నాడు ముని.

అయితే అసలు కారణం మునికి తెలిసింది. తన ప్రాణాలకు తెగించి ఒక మంచి పని చేయాలనుకునే సరికి తన పాపమంతా పోయింది. ఒక్క చెడ్డపని విలువ కూడా చెయ్యని తపస్సు నిరుపయోగమని ఆయనకుతోచింది. చిరంజీవి వద్దకు వెళ్ళి, మంచి పనులు చేస్తూ కాలం వెళ్లబుచ్చాలని ఆయన అనుకున్నాడు.

చిరంజీవి ఆయనతో, "తపస్సు వల్ల చేసేవాడికి మాత్రమే లాభం. మంచి పని చెయ్యడం వల్ల అనేకమంది లాభం పొందుతారు." అని చెప్పాడు.





# వసిష్ఠుడు

దేవర్షుల జాతికి చెందినవారిలో సప్తర్షులు ముఖ్యులు. దేవర్షులలో ప్రథముడు బృహస్పతి, సప్తర్షులలో అగ్రగణ్యుడు వసిష్ఠుడు. బృహస్పతిలాగే సప్తర్షులు కూడా నక్షత్ర రూపంలో ఆకాశంలో ఉత్తరాన కనిపిస్తారు. నిజానికి బృహస్పతి (గురువు) సూర్యుడి చుట్టూ తిరిగే గ్రహం మాత్రమే, కాని సప్తర్షులు సూర్యుడి జాతికి చెందిన నక్షత్రాలు. అందులో వసిష్ఠుడి పేరుగల నక్షత్రం పక్కన, కనపడీ కనపడకుండా మరొక నక్షత్రం ఉంటుంది. అది అరుంధతి, వసిష్ఠుడి భార్య.

వసిష్ఠుడు పెళ్ళాడ నిశ్చయించుకుని, ఇసుకను వండిపెట్టగల కన్యకై వెదుకుతూ ఒక మాలపల్లె వచ్చాడు. అక్కడ ఒక పిల్ల అతను కోరిన విధంగా ఇసుకను వండి, అతన్ని తినమన్నది. వంట చేసిన మనిషి తన భార్య అయితే తప్ప తాను తిననన్నాడు వసిష్ఠుడు. ఆ విధంగా ఆమె అతని భార్య అయింది. ఆమే అరుంధతి.

విశ్వామిత్రుడికీ వసిష్ఠుడికీ శత్రుత్వం ఉండేది. ఇద్దరూ సరస్వతీనదికి రెండు పక్కలా నివసించేవారు. ఒకసారి విశ్వామిత్రుడు, వసిష్ఠుణ్ణి చంపదలచి, అతన్ని తన వద్దకు తీసుకురమ్మని సరస్వతిని ఆజ్ఞాపించాడు. వసిష్ఠుడు చావటం సరస్వతికి ఇష్టంలేదు. కాని తాను చెప్పినట్టు చెయ్యకపోతే విశ్వామిత్రుడు శపించిపోతాడు. అందుకని సరస్వతి వసిష్ఠుణ్ణి ఇవతలి ఒడ్డుకు తెచ్చి, విశ్వామిత్రుడు చంపేలోగా తిరిగి అవతలి ఒడ్డుకు తీసుకుపోయింది.

ఈ ఇద్దరు ఋషులమధ్య వైరం అనేక అనర్థాలకు దారి తీసింది.

ఒకసారి వసిష్ఠుడు మిత్రసహు డనే రాజుకు అతిథిగా వెళ్లాడు. ఆ రాజుపైన

ద్వేషం గల ఒక రాక్షసుడు మోసంచేసి, వసిష్ఠుడి భోజనంలో నరమాంసం వచ్చేటట్టు చేశాడు. తన భోజనంలో రాజు బుద్ధిపూర్వకంగా నరమాంసం చేర్చాడని ఆగ్రహించి, వసిష్ఠుడు అతన్ని శపించాడు. రాజుకూడా వసిష్ఠుణ్ణి శపించటానికి నీరు తీసుకున్నాడు. అయితే అతను ఆ నీటిని వసిష్ఠుడి మీద చల్లక, తన కాళ్ళమీదనే పోసుకుని, కల్మాషపాదు డయాడు.

అయినా కల్మాషపాదుడికి వసిష్ఠుడి శాపం తగిలింది. అతను దారినపోతూంటే వసిష్ఠుడి కొడుకు శక్తి అనేవాడు కనిపించాడు. ఇద్దరూ ఘర్షణపడ్డారు. అది చూసి విశ్వామిత్రుడు ఒక రాక్షసుణ్ణి కల్మాషపాదుడి మీద ఆవాహన చేశాడు. దాని ఫలితంగా రాజు శక్తినీ, వసిష్ఠుడి నూరుగురు కొడుకులనూ చంపేశాడు.

వసిష్ఠుడు పుత్రశోకం భరించలేక ఆత్మహత్య చేసుకుందామని అగ్నిలో దూకాడు. అగ్ని చల్లారింది; సముద్రంలో దూకితే సముద్రుడు వసిష్ఠుణ్ణి ఒడ్డుకు తోసేశాడు.

ఇలా వసిష్ఠుడు ఎన్నివిధాల ఆత్మహత్య చేసుకుందామన్నా సాధ్యంకాలేదు.

చివరకు ఆయన తన ఆశ్రమానికి తిరిగి వచ్చేసరికి, ఆయన కోడలి గర్భం నుంచి వేదపఠనం వినిపించింది. మనవణ్ణి చూసి చచ్చిపోదామని వసిష్ఠుడు ఆశ్రమంలోనే ఉండిపోయాడు.

రాక్షసుడు ఆవహించిన కల్మాషపాదుడు ఒకనాడు వసిష్ఠుడి కోడలిని తరుముకుంటూ వచ్చాడు. వసిష్ఠుడు అతనిపై మంత్రజలం చల్లాడు. కల్మాషపాదుడికి శాపవిముక్తి కలిగింది.

వసిష్ఠుడు సూర్యవంశపు రాజులకు కులగురువుగా పని చేశాడు; దశరథుడికి కొడుకులు కలగగలందులకు పుత్రకామేష్టి చేయించాడు. సంవరణుడు అనే రాజు తపతి అనే సూర్యుడి కుమార్తెను మోహించి, విరహబాధతో సతమతమవుతూంటే, అతని పురోహితుడైన వసిష్ఠుడు సూర్యుడితో చెప్పి, వారిద్దరికీ వివాహం చేయించాడు.





# సురపుష్పమాల

విదర్భ రాజైన భోజుడి కుమార్తె ఇందుమతి. ఆమె శాపకారణంగా మానవ జన్మ ఎత్తిన అప్సర. ఆమె పేరు అప్పుడు హరిణి. ఆమె ఇంద్రుడి సభలో నృత్యం చేసేది.



తృణబిందు మహాముని తపస్సు చేస్తూంటే, అతని తపస్సు భంగం చెయ్యమని ఇంద్రుడు హరిణిని భూలోకానికి పంపాడు. తృణబిందుడు,తపస్సు ఫలించి, ఇంద్రపదవి సాధిస్తాడని ఇంద్రుడి భయం.



హరిణి తృణబిందుడి తపస్సు నైతే భగ్నం చెయ్యగలిగింది గాని, అతన్ని ఆకర్షించలేక పోయింది. ఆయన ఆమెను మనిషిజన్మ ఎత్తమని శపించాడు. శాపవిమోచనం కోసం హరిణి ప్రార్థించగా, పూర్వజన్మ స్ఫురించగానే శాపం పోతుందని చెప్పాడు ముని.



ఇందుమతి యుక్తవయస్కురాలు కాగానే, భోజుడు ఆమెకు స్వయంవరం ప్రకటించి, నానా దేశపు రాజులను ఆహ్వానించాడు.



అయోధ్య రాజైన అజుడు స్వయం వరానికి వెళుతూ ఉండగా దారిలో ఒక ఏనుగు అతన్ని ఎదిరించింది. అజుడు దానితో పోరాడి, దాన్ని చంపాడు.



చచ్చినఏనుగు నుంచి ఒక గంధర్వుడు వెలువడి, తాను శాపకారణంగా ఏనుగు నయాననీ, తన కిప్పుడు శాపవిమోచన కలిగిందనీచెప్పి, కృతజ్ఞతాపూర్వకంగా అజుడికి సమ్మోహనాస్త్రం ఇచ్చాడు.

స్వయంవరంలో ఇందుమతి అజుణ్ణి వరించి, అతని మెడలో వరమాలవేసింది. రాజుల కందరికీ ఇందుమతిని పెళ్ళాడాలని ఉండటం చేత వాళ్ళు అసూయతో అజుడి పైకి వచ్చారు.





అజుడికీ, మిగిలిన రాజులకూ మధ్య యుద్ధం జరిగింది. గంధర్వుడు తన కిచ్చిన సమ్మోహనాస్త్రం ప్రయోగించి, అజుడు శత్రువుల నందరినీ క్షణంలో మూర్ఛపోగొట్టాడు.



తరవాత అజుడు ఇందుమతితో అయోధ్యకు తిరిగి వచ్చి, ఆమెతో కలిసి రాజ్య పాలన చేశాడు.



ఆ దంపతులకు ఒక కొడుకు కలిగాడు. అతడే కాలక్రమాన రాముడికి తండ్రి అయి, పురాణప్రసిద్ధి గాంచిన దశరథుడు.



చాలాకాలం గడిచింది. ఒకనాడు నారదుడు స్వర్గం నుంచి భూమికి దిగుతూండగా, అతని వీణను అలంకరించి ఉండిన సురపుష్పమాల జారిపడింది.



వనవిహారం చేస్తూ ఉండిన ఇందుమతి మీద ఆ మాల పడింది. మరుక్షణమే ఆమెకు పూర్వజన్మ స్మరణకలిగింది. ఆమె శాపంతీరిపోయి, ఇందుమతిగా దేహం చాలించి, తిరిగి హరిణి అయి స్వర్గాన్ని చేరుకున్నది.



# అగ్ని

విశ్వానరుడు అనే బ్రాహ్మణుడు కొడుకు కోసం శివుణ్ణి గురించి కాశీలో తపస్సు చేశాడు. అతనికి శివుడు ప్రత్యక్షమై కొడుకు కలిగేటట్టు వరం ఇచ్చాడు. దాని ఫలితంగా విశ్వానరుడి భార్య శుచిష్మతి గర్భవతి అయి, ఒక కొడుకును కన్నది. విశ్వానరుడి కొడుకు కావటం చేత ఆ కుమారుడికి వైశ్వానరుడు అనే పేరు వచ్చింది. అయితే దేవతలు ఆ బిడ్డకు బారసాల స్వయంగా జరిపి, అగ్ని అని నామకరణం చేశారు.

ఒకనాడు నారదుడు విశ్వానరుణ్ణి చూడవచ్చి, అగ్నికి పన్నెండవ ఏట ప్రాణ భయం ఉన్నదని చెప్పాడు. ఈ మాట విని విశ్వానరుడు చాలా దిగులుపడ్డాడు. అయితే అగ్ని తన తండ్రికి ధైర్యం చెప్పి, కాశికి వెళ్ళి, శివుణ్ణి గురించి తపస్సు చేశాడు.

అగ్ని తీవ్రమైన తపస్సులో ఉండటం గమనించి, ఎవరు తపస్సు చేస్తున్నా ఇంద్రుడికి భయమే గనక, అగ్ని చేత తపస్సు మాన్పించాలని, స్వయంగా వచ్చి, "నీకు ఏం వరం కావాలో కోరుకో," అన్నాడు.

"నేను నీ వరం కోసం తపస్సు చేయటం లేదు. నేను శివుణ్ణి గురించి తపస్సు చేస్తున్నాను," అని అగ్ని నిర్లక్ష్యంగా సమాధానం చెప్పాడు.

ఆ మాటకు ఇంద్రుడు మండిపడి, అగ్నిని వజ్రాయుధంతో కొట్టాడు. అగ్ని మూర్ఛపోయాడు. నారదుడు చెప్పిన ప్రాణ భయం అగ్నికి ఈ విధంగా కలిగింది.

అయితే శివుడు వచ్చి, "నాయనా, లే! దీర్ఘాయువుకా!" అని ఆశీర్వదించి ఆ కుర్రవాణ్ణి ఒక లోకానికి అధిపతిని చేశాడు. అదే అగ్నిలోకం. అది ఆగ్నేయ

దిక్కున ఉన్నది. ఆ విధంగా అగ్ని అష్టదిక్పాలకులలో ఒకడు అయాడు. అతను అష్ట వసువులలో కూడా ఒకడు. యజ్ఞాలు జరిగినప్పుడు, హవ్యాలను దేవతలకు చేర్చేపని అగ్నిది.

అగ్ని భార్యపేరు స్వాహాదేవి. అతని వాహనం మేక.

భృగుమహర్షి పని మీద వెళ్ళుతూ, అగ్నిని కాపాడుతూ ఉండమని తన భార్యకు చెప్పాడు. ఆ సమయంలో పులోము డనే రాక్షసుడు వచ్చి, భృగుడి భార్యను చూసి, ''ఈమె ఎవరి భార్య?'' అని అగ్నిని అడిగాడు.

''ఈమె భృగుడి భార్య, పులోమ,'' అని అగ్ని చెప్పాడు.

''ఈమె నాకు భార్యకావలసినది, కాని భృగుడు పెళ్ళాడాడు,'' అని చెప్పి, పులోముడు ఆమెను ఎత్తుకుపోయాడు. తరవాత పులోముణ్ణి పులోమకొడుకు చంపాడు. తరవాత పులోమ తన భర్తకు అగ్ని మీద చాడీ చెప్పింది. భృగుడికి కోపం వచ్చి, అగ్నిని సర్వభక్షకుడవు కమ్మని శపించాడు.

అగ్ని అలిగి వెళ్ళి ఒకచోట కూర్చుని, దేవతలకు హవ్యాలు అందించటం మానేశాడు. దేవతలు విష్ణువు వద్దకు వెళ్లి అగ్ని తమకు హవ్యాలు చేర్చటంలేదని చెప్పారు. విష్ణువు దేవతలను వెంటబెట్టుకుని వెళ్లి, అగ్నిని పొగడి, ''సర్వ భక్షకుడవైతే నేం? నువు నిత్యశుచివి. సమస్తాన్నీ పవిత్రం చేస్తావు!'' అని, తిరిగి హవ్యవాహనుణ్ణి చేశాడు.

శ్వేతకి అనే రాజు చేసిన యజ్ఞాల మూలంగా అగ్నికి మందంచేసింది. అగ్ని తన ఆరోగ్యం చెడిందని మొరపెట్టుకోగా, బ్రహ్మ మంచి ఓషధులుగల ఖాండవ వనాన్ని దహించినట్టయితే ఆరోగ్యం చేకూరుతుందని చెప్పాడు. ఆ ప్రకారమే అగ్ని కృష్ణార్జునుల సహాయంతో ఖాండవ వనాన్ని దహించి, తిరిగి ఆరోగ్యం పొంది, అర్జునుడికి బహుమానంగా గాండీవాన్నీ, కృష్ణుడికి చక్రాన్నీ ఇచ్చాడు.



# గరిసెలో బంగారం

కమలాపురం జమీందారు చేతికి ఎముకలేకుండా దానధర్మాలు చేశాడు. ఆయన ముసలి వాడయ్యేటప్పటికి సంస్థానం పూర్తిగా క్షీణించిపోయింది.

దివాణం సింహద్వారం నుంచి ఉత్తరంగా మూడు మైళ్ళవరకూ కాలిబాట ఉన్నది. ఆ బాట చివర కొండల నడుమ ఒక సరోవరం ఉన్నది.

మంచంపట్టి, మరో గంటలో కన్ను మూయబోతున్న జమీందారు ఊళ్లోని పెద్దలను పిలిపించి, "మీ కొక రహస్యం చెప్పాలి. నాకు బిడ్డలులేరు గనక మీరే నా బిడ్డలు. దివాణం నుంచి సరోవరానికి వెళ్ళేబాట కింద ఎక్కడో మా నాన్నగారు గరిసె నిండా బంగారం పాతి పెట్టారట. నేను కన్ను మూశాక గ్రామస్థులు దాన్ని తవ్వితీసి, సమంగా పంచుకోండి. నా ఆత్మ శాంతికి ఏం చెయ్యాలో ఈ పెట్టెలో ఉన్న ఉత్తరం తీసి చూడండి. నిధి దొరికిన తరవాతనే ఆ పెట్టె తెరవండి," అని ప్రాణం విడిచాడు.

ఊళ్ళో వాళ్ళంతా కలిసి మూడుమైళ్ళ పొడుగునా కాలిబాటను పది అడుగులలోతు తవ్వారు. ఎక్కడా బంగారపు గరిసె లేదు. పెద్దలు విసిగిపోయి ఉత్తరం తీసి, ఇలా చదివారు: "నిధి దొరకలేదని నిరాశపడకండి. కాలవను సరోవరంతో కలపండి. మీ భూముల్లో బంగారం పండి, మీ గరిసెల్లో బంగారం నిండుతుంది."

—కలువకొలను సదానంద






ఒక పల్లెటూరి వ్యాపారి, పట్నంలో వ్యాపారం చేసుకుందామని తనకున్న ఆస్తిపాస్తులన్నీ అమ్ముకుని, తన ఇద్దరు కొడుకులతో పట్నం వచ్చాడు. అతను తన డబ్బు చాలావరకు వ్యాపారానికి మదుపుపెట్టి, మిగిలిన కొద్ది డబ్బుతో ఒక పాత కొంప కొనుక్కుని, అందులో నివసించాడు. పట్నం వ్యాపారం కలిసి రాలేదు. పెట్టుబడి అంతా నష్టమై పోయింది. చివరకు వ్యాపారి బెంగతో చనిపోయాడు.

వ్యాపారి పెద్దకొడుకు చిన్నవాడితో, "ఈ పాత బొళ్ళు కొంప మనకు అచ్చి రాలేదు. దీన్ని అమ్మేసి, ఇంకేదైనా వ్యాపారం ప్రారంభించుదాం," అన్నాడు.

తమ్ముడు సరేనన్నాడు.

అన్నదమ్ము లిద్దరూ ఇంట్లో ఉన్న సామానంతా తణిఖీ చేసుకుంటూ, మెట్ల కింద ఉన్న కొట్టు తాళం తీసి లోపలికి వెళ్ళారు. అందులో విరిగిన కర్ర సామాను తప్ప ఏమీ లేదు.

"ఇక్కడ మనం వెంట తీసుకుపోయేది ఏమీలేదు. దీన్ని ఇలాగే ఉండనిచ్చి, ఇల్లు అమ్మేద్దాం," అన్నాడు అన్న.

అంతలో ఆ గదిలో ఒక ఆకారం ప్రత్యక్షమయింది. అదేదో భూతమని గ్రహించి, అన్నదమ్ముల గుండెలు అవిసిపోయాయి.

"ఏమిటి, మీరు నిజంగా ఈ ఇల్లు అమ్మేస్తున్నారా?" అని భూతం వాళ్లను అడిగింది.

అన్న ధైర్యం తెచ్చుకుని, "అవును! అవును! ఈ పాడు కొంప మాకు అచ్చి రాలేదు. ఏదన్నా వ్యాపారం చేసుకుందామంటే మా దగ్గిర చిల్లిగవ్వ లేదు," అన్నాడు.

మాచిరాజు కామేశ్వరరావు

"వద్దు, వద్దు! మీరీ ఇల్లు అమ్మవద్దు. నేనీ గదిలో ప్రశాంతంగా తపస్సు చేసుకుంటున్నాను. మీరీ ఇంటిని ఎవరికన్నా అమ్మితే వాళ్ళు నా ప్రశాంతతను పాడు చెయ్యవచ్చు, లేదా, ఏకంగా ఈ ఇల్లు పడగొట్టి, కొత్త ఇల్లు కట్టవచ్చు." అన్నది భూతం.

"నీ సౌకర్యం చూస్తూపోతే, మేం ఇద్దరం బతకడం ఎలాగ?" అన్నారు అన్నదమ్ములు.

"మీకు కావలసినది డబ్బు గదా, మీకు నేను డబ్బిస్తాను. మీ ఇష్టం వచ్చిన వ్యాపారం చేసుకోండి," అని భూతం వాళ్ళకు కొంత డబ్బు ఇచ్చి, అదృశ్యమయింది.

అన్నదమ్ములు ఆ గదికి మళ్లీ తాళం పెట్టేశారు.

"సునాయాసంగా బోలెడంత డబ్బు దొరికింది! దీంతో ఏం వ్యాపారం ప్రారంభింతాం?" అని తమ్ముడు అన్నను అడిగాడు.

"నీ తెలివి తెల్లవారినట్టే ఉంది! కామధేనువులాటి భూతాన్ని ఇంట్లో పెట్టుకుని, ఇంక వ్యాపారం దేనికి? ఎప్పుడు కావాలంటే అప్పుడు భూతాన్ని అడిగి మన కవసరం అయిన డబ్బు పుచ్చుకోవచ్చు." అన్నాడు అన్న.



అన్నదమ్ము లిద్దరూ తాగితందనాలాడి, జూదాలాడి భూతం ఇచ్చిన డబ్బంతా రెండు వారాలకల్లా ఖర్చు చేసేశారు.

తరవాత వాళ్ళు భూతం ఉన్న కొట్టు తలుపు తెరిచి, భూతాన్ని ఉద్దేశించి, "నువ్విచ్చిన డబ్బుతో బట్టల వ్యాపారం ప్రారంభించాం. నిన్న రాత్రి నిప్పు అంటుకుని, సరుకంతా కాలిపోయింది. ముందు అనుకున్నదే గదా, ఈ కొంప మాకు అచ్చి రాదు, అమ్మేస్తాం!" అన్నారు.

"మీ అజాగ్రత్త వల్ల వచ్చిన నష్టాన్ని ఈ కొంపకు ఎందుకు అంటగట్టుతారు? మళ్ళీ డబ్బు ఇస్తాను. మరో వ్యాపారం

ఏదైనా ప్రారంభించండి," అని భూతం ఆ అన్నదమ్ములకు మరికొంత డబ్బు ఇచ్చింది.

ఈసారి వాళ్ళు ఆ డబ్బును పది రోజుల్లోనే ఖర్చు చేసేశారు.

"ఈ కొంప దరిద్రపు కొంపే. మళ్ళీ నష్టం వచ్చింది. ఒకవేళ నా పేరు మీద వ్యాపారం చెయ్యటంచేత నష్టం వచ్చిందేమో. ఈసారి మా తమ్ముడి పేర చేసి చూస్తాను," అని బొంకి అన్న భూతం దగ్గిర మళ్ళీ డబ్బు లాగాడు.

ఆ డబ్బు కూడా పది రోజుల్లోనే ఖర్చయింది.

"ఈ చిన్న చిన్న మొత్తాలు కాదు. ఏకంగా భూతం దగ్గిర పెద్ద మొత్తం పుచ్చుకోవాలి," అన్నాడు అన్న తమ్ముడితో.

వాళ్ళు మళ్ళీ భూతం ఉన్న కొట్టు ప్రవేశించి, "వ్యాపారం అచ్చి రావటం లేదు. పొలం కొని వ్యవసాయం చేసి చూడాలనివుంది. ఈసారి కొంచెం పెద్ద మొత్తంగా ఇయ్యి," అని భూతాన్ని అడిగారు.

భూతం కొంచెంసేపు ఆలోచించి, "నిజంగానే ఇది అచ్చిరాని కొంపలాగున్నది! మీకా మూడుసార్లు వ్యాపారం దెబ్బ తిన్నది. మీ నాన్నకూ ఈ ఇల్లు అచ్చిరాలేదు. నేను ప్రశాంతంగా తపస్సు చేసుకుని, ఈ జన్మనుంచి విముక్తి పొందుదామని ఇంతకాలంగా చూస్తూంటే, నా కోరికా తీరే లక్షణాలు కనపడకుండా ఉన్నాయి. ఇది అచ్చిరాని కొంపే! దీన్ని వెంటనే అమ్మేయండి. నేను మరో చోటు చూసుకుంటాను," అని అదృశ్యమయింది.

అన్నదమ్ములు అనుకోని ఈ పరిణామంతో హతాశులైపోయారు.

ఆ రాత్రి వర్షం కురిసింది. ఆ ఇంటి మీద పిడుగు పడింది. అన్నదమ్ములు ఎలాగో ప్రాణాలతో బయట పడ్డారు. ఇప్పుడు అమ్ముకుందామంటే ఆ అచ్చిరాని కొంప కూడా లేదు.





# రాజకుమారుడి మూగతనం

మోతీపుర రాజవంశం వింత ఆచారాలు పాటించేవారు. రాజుగారి పెద్ద కొడుకు రాజయ్యేవాడు. అయితే వాడు ఏ కారణం చేతనైనా దేహశక్తులుగాని, మానసిక శక్తులుగాని కోల్పోతే వాడికి రాజ్యాధికారం ఉండేది కాదు; వాడి తరవాత వాడు రాజయేవాడు. కాని పెద్దవాడు చచ్చిపోవటం జరిగితే రాజ్యాదాయంలో సగం ఆలయానికి ఒక తరంపాటు పోయేది.

మోతీపురరాజు విక్రముడికి శ్రీమతీ, సుమతీ అని ఇద్దరు భార్యలు. వారికి వరుసగా కమల్, కునాల్ అని ఇద్దరు కొడుకులు. పెద్దవాడైన కమల్ పధ్నాలుగేళ్ళవాడై ఉండగా, రాజు వాణ్ణి యువరాజుగా ప్రకటించాడు. ఈ వార్త విని, అసూయాపరురాలైన సుమతి కుమిలిపోయింది. కమల్‌ను రాజు కావటానికి అనర్హుణ్ణి చేస్తే తన కొడుకు రాజవుతాడు. కాని కమల్‌ను వికలాంగుణ్ణి చెయ్యటం ఎలా? సుమతి ఒకసారి తన పుట్టింటికి వెళ్ళి, జటిల అనే తన మేనత్తతో తన సమస్య చెప్పింది.

"కమల్‌కు కాలో, చెయ్యో విరిగేటట్టు చూడలేవా?" అని జటిల సుమతిని అడిగింది.

"లాభం లేదు. అటువంటి ప్రయత్నంలో వాడి ప్రాణమే పోతే ఖజానాలో సగం దేవాదాయం అయిపోతుంది. ప్రయత్నం విఫలమైతే మనకు ప్రమాదం! మనకు సహాయపడినవాళ్లు మనకు ద్రోహం చెయ్యవచ్చు," అన్నది సుమతి.

జటిల కొంచెం ఆలోచించి, ఒక సీసాలో ఏదో ద్రవం సుమతికి ఇచ్చి, "దీన్ని ఒక్క బొట్టు చొప్పున కమల్ తాగే పాలలో కలిపి ఇయ్యి. క్రమంగా వాడి మాట పడిపోతుంది. అదీ వైకల్యమే

ఏ. సి. సర్కార్, ఐంద్రజాలికుడు

గనక వాణ్ణి రాజు చెయ్యరు. నీ కొడుకు రాజవుతాడు,'' అన్నది.

సుమతి ఇంటికి తిరిగివచ్చి, రాత్రి పూట తన కొడుక్కూ, తన సవతి కొడుక్కూ పాలు ఇచ్చేటప్పుడు యువ రాజు పాలలో ఒక చుక్క ద్రవం కలిపి ఇయ్యసాగింది. క్రమంగా కమల్ కంఠ ధ్వని బొంగురుపోతూ వచ్చి, చివరకు మాట పూర్తిగా పోయింది. ఇద్దరు రాణులూ ఒకే భవనంలో వేరు, వేరు గదులలో ఉన్నప్పటికీ, రెండు కుటుంబాలకూ ఒకే పాకశాల ఉండేది. దాని అజమాయిషీ అంతా సుమతిదే.

రాజకుమారుడికి మాట పడిపోవటానికి గాను ఏదో దుర్మార్గం జరుగుతూ ఉండి ఉంటుందని మంత్రి ధీమాన్ సందేహించి, ఒక పరిచారికను సుమతి సేవలో నియోగించి, గూఢచారిగా పనిచేయించసాగాడు. అదే సమయంలో ఆయన కళింగదేశం నుంచి రఘునాధు డనే వైద్యుణ్ణి రాజ కుమారుడికి చికిత్స చేయటానికి పిలిపించాడు.

రఘునాధుడు బక్కగా, నల్లగా ఉండి, ఏమాత్రమూ ఆకర్షణీయంగా లేకపోగా, సాధారణమైన శక్తి సామర్థ్యాలు కల వాడుగా కూడా కనబడలేదు. దిగ్గజాల వంటి ఆస్థాన వైద్యులు చెయ్యలేకపోయిన చికిత్స ఈ రఘునాధుడి వల్ల అవుతుందని రాజు నమ్మలేక, అతని వైద్యాన్ని నిరాకరించాడు.



మంత్రి ధీమాన్‌కు ఏం చెయ్యటానికీ పాలుపోలేదు. ఆ పరిస్థితిలో, ఆస్థాన ఐంద్రజాలికుడు సోమనాథుడు ధీమాన్‌కు ఒక ఉపాయం చెప్పాడు. ధీమాన్ రఘునాథుణ్ణి రాజు వద్దకు తీసుకుపోయి, ''మహారాజా, ఈ రఘునాథుడు వైద్యంలో అతీత ప్రజ్ఞగలవాడు. ఇతను తన ఔషధ ప్రభావంతో ప్రాణంలేని వాటిని సైతం పలికించగలడు. కావలిస్తే ఇతని శక్తులను స్వయంగా పరీక్షించవచ్చు,'' అన్నాడు.

''అలాగే,'' అన్నాడు రాజు.

మంత్రి ఒక చిన్న దేవతార్చన గంటలాటిది పైకి తీసి, దాన్ని ఆడించి మోగించి, తరవాత గంటలోని నాలుక తీసేసి, ఆడించినా గంట మోగదని చూపించి, దాన్ని రాజుకు పరీక్షించటానికి ఇచ్చి, తరవాత రఘునాథుడికి ఇచ్చాడు. రఘునాథుడు ఆ నాలుకలేని గంట మీద రెండు చుక్కలు మందు చల్లి, కుడిచేత పట్టుకుని ఆడించాడు. గంట మోగుతున్న ధ్వని ఆశ్చర్యంగా వినవచ్చింది. అలా రెండు మూడుసార్లు మోగించి చూసి, రఘునాథుడు గంటను మంత్రికిచ్చాడు. మంత్రి దాన్ని రాజుకు ఇచ్చాడు. రాజు దాన్ని ఆడించిచూశాడు. అది మోగలేదు.

''మీరు కమల్‌కు ఈ అపర ధన్వంతరి చేత తప్పకుండా చికిత్స చేయించండి,'' అన్నాడు రాజు మంత్రితో.

రఘునాథుడు కమల్‌ను పరీక్షించి, ''ఇతనికి ఎవరో చాలా ఒడుపుగా విష



ప్రయోగం చేస్తున్నారు,'' అని మంత్రితో చెప్పాడు.

మంత్రి తన గూఢచారి అయిన పరిచారికను హెచ్చరించాడు. పరిచారిక, సుమతి పాలలో ఏదో మందు ఒక చుక్క వేస్తూండటం గమనించి, మంత్రికి చెప్పింది. మంత్రి ఆ మందు సీసాను పరిచారిక చేత రహస్యంగా తెప్పించి, దాని స్థానంలో అలాటి సీసానే ఉండేటట్టు చేశాడు.

రఘునాథుడు రాజకుమారుడి చికిత్స ప్రారంభించాడు. క్రమంగా కమల్‌కు ధ్వనులు చేసే శక్తి, మాట్లాడే శక్తి వచ్చాయి. సుమతి అతని పాలలో చుక్కలు వేస్తూనే ఉన్నది, కాని అవి ఎందుకో పని చెయ్యటం లేదు.

కమల్ చికిత్స పూర్తి అయింది. ధీమాన్ సుమతి ద్రోహాన్ని రాజుకు చెప్పి, ఆమె ఉపయోగించిన విషంగల సీసాను ఇచ్చాడు. రాజు మొదట నిర్ఘాంత పోయాడు. తరవాత అతను ఆ సీసాతో సుమతి వద్దకు వెళ్ళి, ఆమె గదిలో అలాటిదే మరో సీసా తీసి, ''ఇది విషం కాదు. అసలు విషం నా చేతిలో ఉన్నది. నువు కొంతకాలంగా విషం అనుకుని కమల్ పాలలో నీళ్ళచుక్కలు వేస్తున్నావు.'' అన్నాడు.

సుమతి అమాయికంగా, ''మీరు అనేది నాకు అర్థంకావటంలేదు,'' అన్నది.

రాజు తన చేతిలోని సీసామూత తీస్తూ, ''ఇందులో నుంచి ఒక చుక్క వేసి నీ కొడుకు చేత తాగించు,'' అన్నాడు.

తన పరిచారికగా పనిచేసిన మనిషి తన దుర్మార్గాన్ని చూసిందని తెలిసినాక సుమతి నిర్దోషిగా నటించే ప్రయత్నం మానింది. ఆమెను రాజు అప్పటికప్పుడు ఖైదు చేయించాడు.

నాలుకలేని గంట ఎలా మోగింది? అలాటి చిన్నగంటను మరొకదాన్ని రఘునాథుడు తన చొక్కాలోపల చేతికి కట్టుకున్నాడు. ఇది సోమనాథుడు చేసిన ఇంద్రజాలం.





# దేవుడితో చదరంగం

పూర్వం ఒకానొకప్పుడు ఒక స్వాముల వారుండేవారు. ఆయన గొప్ప పండితుడని పేరు పొందాడు. ఆయనకు దేశమంతటా శిష్యగణం ఉండేది. వారంతా స్వామి దర్శనంకోసం తహతహ లాడిపోతూ వుండే వారు.

స్వామి ఒక్క ఆరు నెలలు మాత్రమే తన ఆశ్రమంలో వుండి శిష్యులకు వేద వేదాంగ రహస్యాలు అన్నీ విప్పి చెబుతూ, తక్కిన ఆరు నెలలూ దేశాటన చేసేవాడు. సంచారం సాగించే సమయంలో శిష్యులు భక్తితో సమర్పించే తృణమో పణమో స్వీకరించి, దానితో తృప్తిపడేవాడు.

ఇలా స్వామి వారు దేశాటన చేసుకొంటూ, ఒకప్పుడు పల్లెప్రాంతంలో వుండే శిష్యుల వద్దకు వెళ్ళడం తటస్థించింది. స్వామి అల్లంత దూరాన ఉండగానే, ఈ వార్త వాడవాడలా అల్లుకొన్నది. శిష్య బృందం అంతా చేరి, మంగళ తూర్యారావాలతో స్వామిని ఎదుర్కొని గ్రామంలోకి తీసుకవచ్చారు. విష్ణు ఆలయపు ఆవరణలో వుండే ఒక మండపంలో వారికి బస ఏర్పాటు చేశారు.

గ్రామంలో స్వామి అడుగు పెట్టింది మొదలుకొని, ఇక ఆ సందడి చెప్పతరమే కాదన్నమాట! భజనలతో, కాలక్షేపాలతో, పురాణ పఠనాలతో కాలం సద్వినియోగం ఐనందుకు గ్రామస్థులు ఆనందించి, ధన్యులమయ్యామని అనుకొన్నారు.

ఆ గ్రామస్థులను తరింపజేసిన వెంటనే స్వామి మరి ఒక గ్రామానికి మకాం మార్చటానికి యత్నపడుతున్నాడు. శిష్యుల నందరినీ సంతోష పెట్టాలికదా మరి? ఇంకొక్క గంట సేపటిలో బయలు దేరతాడనగా, స్వామి తన బసలో ఏదో



ఆలోచిస్తూ అటు యిటు పచార్లు చేయసాగాడు.

అలా పచార్లు చేస్తున్న స్వామికి ఎదట అడవిలో ఒక మనిషి చేసే వింత చేష్టలు ఆశ్చర్యం కలిగించినై.

'వీడెవడురా అబ్బా, ఒకవేళ పిచ్చివాడు కాదుకదా!' అనుకొన్నాడు స్వామి తన మనస్సులో. పరకాయించి చూస్తే, ఆ దుస్తులూ వాడూ, ఒక సంపన్న గృహస్థులాగా కనిపించాడు.

ఈ చిత్ర మేమిటో కనుక్కోవాలనే నిశ్చయంతో, స్వామి పాదచారిగానే బయలుదేరి అతని దగ్గరకు వెళ్ళాడు. స్వామి అలా రావటం ఏమీ గమనించలేనట్టుగా వాడు తనలో తనే మాటాడుకొంటూ, కాళ్ళూ చేతులూ వింతగా ఊపుతూ వున్నాడు.

"అబ్బాయీ ఏమిటిదంతా? నువ్వు ఇక్కడ ఎవరితో మాటాడేది?" అని స్వామి ప్రశ్నించాడు.

"మాట కాదు, ఆట. ఆటాడుతున్నాను. నేనెవరితో ఆడుతున్నానో, బహుశా వారు మీకు కనబడరేమో!" అని బదులు చెప్పాడు ఆ కొత్త మనిషి.

విస్మయం పొందాడు స్వామి. "వీడు పిచ్చివాడా!" అని మళ్ళీ ఒకసారి సంశయం కలిగింది ఆయనకు.

"అబ్బాయ్, నువ్వాడే ఆట యేమిటి? నీతో ఆడే ఆ అవతలివారెవరు? ఆ సంగతేదో నాకు చెప్పవచ్చా?" అని అడిగాడు స్వామి.

"అదే ఉన్న రహస్యమల్లా! ఐనా లోక కల్యాణం కోసం అవతరించిన మహానుభావులు మీరు. మీకు వెల్లడి చేయటానికి అభ్యంతరమేముంది? నేను ఆడే ఆట చదరంగం. నాతో ఆడే అవతలివాడు కేవలమూ ఆ దేవుడే!" అని చెప్పాడు తొణుకూ బెణుకూ లేకుండా, ఆ వింత మనిషి.

స్వామికి పొట్ట చెక్కలయ్యేలా నవ్వు వచ్చింది. "వీడెవడో నిజంగా పిచ్చివాడే,

సందేహంలేదు. కాని ఆ పిచ్చిలోనూ ఒక తెలివీ, పద్ధతీ కనబడుతున్నది'' అనుకొన్నాడు స్వామి.

అప్పుడు స్వామి ''ఐతే, గెలుపెవరిది?' అని మళ్ళీ అడిగాడు.

''ఉండండి, ఉండండి! ఇంకా ఆట పూర్తి కాలేదు,'' అని అతను చెట్టుమీదికి చూస్తూ, ''మీరన్న 'రాజూ ఆటకట్టు!' అన్నమాట విన్నాను, దేవా! ఇవాళ గెలుపు మీదే,'' అంటూ, జేబులో చెయ్యిపెట్టాడు.

ఈ చర్య స్వామికి మరింత వింత కొలిపింది. ''మరి, గెలిచినవాళ్ళకు ఓడినవాళ్ళు ఏమైనా ఇచ్చుకోవాలా?'' అని ప్రశ్న వేశాడు.

''లేకేమి స్వామీ! ఆటకు రెండు మొహరీలు చొప్పున పందెం'' అని చెప్పాడు ఆ కొత్త మనిషి.

''ఐతే, ఇప్పుడు నువు ఓడిపోయావు కదా మరి, దేవుడికి రెండు మొహరీలూ చెల్లించలేదేం?'' అని తమాషాకు అడిగాడు స్వామి.

అడగటమే తడవుగా అతను గభీమని జేబులోనించి రెండు మొహరీలు తీసి - ''దేవుడు ఎప్పుడూ తన పందెం డబ్బు నా దగ్గరనుండి స్వయంగా తీసుకోడు. ఆ సమయానికి ఏ భాగవతోత్తముని రూపంలోనో వచ్చి ప్రత్యక్షమవుతాడు.



వారికి ఇస్తే దేవుడికి చెందుతుంది ఆ ధనం. ఇవాళ అదృష్టవశాన మీరు వచ్చారు. కనుక, దయచేసి ఈ మొహరీలు రెండూ, తమరు పుచ్చుకొన్నారంటే ఆ దేవుడికి అందేస్తుంది'' అంటూ రెండు నాణాలు స్వామి చేతిలో పెట్టాడు.

ఆ నిమిషాన ఏం చేద్దామన్నా స్వామికి పాలుపోయింది కాదు. వెంటనే బసకు మరలిపోయి, పిచ్చివాళ్ళలో కూడా ఎంతటి గొప్ప భక్తులున్నారో తన శిష్య బృందానికి ఆయన తెలియజెప్పాడు.

రెండు నెలల తరవాత-

స్వామివారు కొంతవరకు దేశ సంచారం చేసి, శిష్యకోటిని తరింపజేస్తూ, వారిచ్చిన

కట్నాలూ కానుకలూ మూటకట్టుకొని, ఇంటిముఖం పట్టాడు. తిరుగుదలలో వారు మళ్ళీ ఇదే గ్రామం రావడం తటస్థించింది.

ఊరిలో దిగుతూనే, స్వామికి వెనుకటి వింత మనిషి సంగతి గుర్తుకు వచ్చింది. మళ్ళీ అడవిలో ఆ ప్రాంతంలో చూస్తే, ఆ పిచ్చివాడు ఎప్పటి చోటనే కనిపించాడు. వెంటనే కుతూహలం కొద్దీ స్వామి అతని వద్దకు వెళ్ళి—

"అబ్బాయ్!-ఇవాళ ఎవరిది గెలుపు?" అని వినోదంగా ప్రశ్నవేశాడు.

ఆడుతూ ఆడుతూ వున్న అతను అట్టె ఒకమారు మునుపటిలాగానే చెట్టుపైకి చూశాడు. "రాజూ ఆటకట్టు!" అని పెద్దగా అరిచి, పకపక నవ్వాడు.

"ఏమిటోయ్ ఖులాసా? చూడగా ఇవాళ నువ్వే గెలిచినట్టుందే!" అన్నాడు స్వామి.

"గెలిచాను, స్వామీ, గెలిచాను మీచలవ వల్ల. అదృష్టం యేమిటో కాని ఈ సారి పందెం కూడా ఘనమయిందే! వంద మొహిరీలు!" అని చెప్పి, మళ్లీ పకపక నవ్వాడు. "ఐతే—దేవుడు ఆ డబ్బు నీకు ఏ విధంగా చెల్లిస్తాడు?" అని అడిగాడు స్వామి, పొంగి పొరలే నవ్వు ఆపుకొంటూ.

"దేవుడు ఎన్నడూ నాకు స్వయంగా డబ్బు చెల్లించడు. ఆ సమయానికి ఏ పరమ భాగవతోత్తముని రూపంలోనో సాక్షాత్కరించి, నాకు అందజేస్తాడు. ఇవాళ అదృష్టవశాన తమరు దర్శనమిచ్చారు సమయానికి" అన్నాడు వాడు.

ఈ మాట అర్థంగాక తెల్లబోయి చూస్తున్నాడు స్వామి. "తమరు నాకు చెల్లించివేస్తే, దేవుడి బాకీ తీరిపోతుంది!" అంటూ ఆ మోసగాడు పక్క పొదలో లోగడే దాచి వుంచిన దుడ్డుకర్ర బయటికి తీశాడు.

స్వామి బిత్తరపోతూ, సంచారంలో శిష్యకోటి తనకు సమర్పించిన సమస్తమూ వాడికి సమర్పించుకొని, ఉత్త చేతులతో ఇంటికి దారితీశాడు!





# దేవీ భాగవతం

తన భార్యనూ, కొడుకునూ కూడా దూరం చేసుకుని, శంతనుడు చాలా బాధపడ్డాడు. అతను ఏదో విధంగా రాజ్యం చేస్తూ, ఒకసారి వేటకు వెళ్లి, గంగను చూసి ఆశ్చర్యపోయాడు. గంగానది పూర్తిగా తీసిపోయి, చిక్కి శల్యమైనట్టుగా ఉన్నది. కొద్ది దూరంలో ఒక బాలుడు తన విలువిద్యా చాతుర్యంతో గంగా ప్రవాహానికి అడ్డుగా బాణాలు వేస్తున్నాడు. కుర్రవాడు చాలా ఆకర్షవంతంగా ఉన్నాడు.

శంతనుడు అతన్ని చూసి, వాడు తన కొడుకైతే బాగుండుననీ, కాడేమోననీ, అనుకుంటూ దగ్గిరకు వెళ్ళి, "నాయనా, నీ తండ్రి ఎవరు? నీ తల్లి ఎవరు? నీ పేరేమిటి? నీది ఏ ఊరు?" అని అడిగాడు.

కాని ఆ కుర్రవాడు శంతనుడి ప్రశ్నలకు సమాధానం ఇయ్యక, నదిపైకి బాణాలు వెయ్యటంలో నిమగ్నుడై ఉండిపోయాడు.

కుర్రవాడు కొంతసేపు అలా ఆడి ఆడి, ఎటో వెళ్లిపోయేసరికి, శంతనుడు గంగను తలుచుకున్నాడు. వెంటనే గంగ పూర్వపు రూపంలో కనిపించింది.

శంతనుడు ఆమెను, "ఇక్కడ ఒక ముచ్చటైన కుర్రవాడు కనిపించి, అంతలో ఎటో వెళ్లాడు. వాడెవడో చెప్పి, నాకు వాణ్ణి చూపించగలవా?" అని అడిగాడు.

## 7. కౌరవ పాండవుల కథ



గంగ నవ్వి, ''వాడు ఎనిమిదో వసువు, నీ కొడుకే. తెచ్చి చూపిస్తాను. వాణ్ణి ఆదరించు," అని గాంగేయుణ్ణి తెచ్చి శంతనుడికి చూపి, ''వీడు వసిష్ఠుడి వద్ద వేదాలన్నీ నేర్చుకున్నాడు. పరశురాముడికి శిష్యత్వం చేశాడు. వీడే నీ కులాన్ని ఉద్ధరిస్తాడు,'' అంటూ అదృశ్యమైంది.

శంతనుడు తన కొడుకును కౌగలించుకుని, తన రథం మీద కూర్చోబెట్టుకుని రాజధానికి తెచ్చి, మంత్రి పురోహితాదుల అనుమతితో వాణ్ణి యువరాజుగా అభిషేకించాడు.

నాలుగేళ్ళు గడిచాయి. తరవాత ఒకనాడు శంతనుడు వేటాడుతూ కాళిందీ నదీ తీరానికి వెళ్లి, వేటలో అలసి, చల్లగా ఒక చెట్టు నీడన విశ్రమించి ఉండగా, గొప్ప సువాసనతో కూడిన గాలి తెమ్మెరలు అతన్ని సోకాయి.

శంతనుడు ఆశ్చర్యపడి, ఆ సువాసనకు కారణం వెదుకుతూ, గాలి వచ్చిన దిక్కుగా అరణ్యంలో తిరగసాగాడు. కొంతసేపటికి అతని ఎదట అప్సరలాటి ఆడది ఒకతె కనబడింది. నిస్సందేహంగా ఆమె శరీరంనుంచే సువాసనలు వస్తున్నాయి. ఆమె ఏ దేవకాంతో, కిన్నర స్త్రీయో, నాగకన్యకో అయి ఉంటుంది కాని మానవస్త్రీ మాత్రం కాదనుకున్నాడు శంతనుడు.

అతను ఆమెను సమీపించి, ''నువు ఎవతెవు? నీ తండ్రి ఎవరు? ఈ అరణ్యంలో ఒంటరిగా ఎవరికోసం తిరుగుతున్నావు? నీ భర్త ఎవరు?'' అని అడిగాడు. ఆమెను చూడగానే తనకు ఆమె మీద మోహం కలిగినట్టు కూడా అతను చెప్పాడు.

ఆమె చిరునవ్వుతో, ''నేను కన్యను. నా తండ్రిని దాశరాజు అంటారు. ఇప్పుడే వస్తాను, తాను తిరిగి వచ్చేవరకూ నావ నడుపుతూ ఉండమని చెప్పి, ఆయన ఇంటికి వెళ్లాడు. అదే ఆయన వుండే ఇల్లు,'' అన్నది.

"నేను రాజును. మాది కురువంశం. నీ యౌవనమంతా ఎందుకు వ్యర్థం చేసుకుంటావు? నాకు భార్యవై సమస్త సుఖాలూ అనుభవించు. నా కింకో భార్య లేదు. ముందు ఒకతె నన్ను వరించి, ఏవేవో ఆశలు పెట్టి, వెళ్లిపోయింది. తరవాత నేను మరేస్త్రీని తలవలేదు. కాని నిన్ను చూడగానే కోరిక పుట్టింది. నీకు దాసుడై ఉంటాను. నన్ను మళ్లీ సంసారిని చెయ్యి," అన్నాడు శంతనుడు.

అతని మాటలకు ఆమె పూర్తిగా చలించి, సిగ్గుపడుతూ, "నీకు నా మీద కలిగిన మోహం నాకు మాత్రం నీ మీద కలగదా? కాని స్త్రీలు ధర్మం తప్పరాదు. వాళ్ళకు పెద్దలు పెళ్లి చేయాలిగాని, తమకు తామే ఎవరినో పెళ్లాడేసి, పెద్దవారికి తలవంపులు కలిగించరాదు. అందుచేత నువు నా తండ్రితో చెప్పి, ఆయన అనుమతితో నన్ను పెళ్ళాడు," అన్నది.

ఆమె చెప్పినది సబబుగానే ఉండటం చేత శంతనుడు ఆమె తండ్రి వద్దకు వెళ్లి, తన కోరిక చెప్పనిశ్చయించాడు.

దాశరాజు శంతనుణ్ణి దూరానే చూసి, చేతులు జోడించి ఎదురువస్తూ, ఎంతో వినయ విధేయతలతో, "తమ దాసుణ్ణి! తమరు ఇలా రావటం నా అదృష్టం!



నా వల్ల ఏం పని కావాలి? సెలవియ్యండి," అన్నాడు.

"నీకు అభ్యంతరం లేకపోతే నీ కూతుర్ని పెళ్ళాడతాను. ఇదే నేను కోరినది," అన్నాడు శంతనుడు.

ఆ మాట విని దాశరాజు పరమానందం చెంది, "మహారాజా, నా కూతుర్ని నువు పెళ్ళాడి, నా వంశానికి ప్రతిష్ఠ తెసానంటే, నాకు అంతకన్న ఏం కావాలి? అయినా నాది ఒక్క కోరిక: నీకూ, నాకూతురికీ పుట్టే కొడుకు నీ అనంతరం రాజు కావాలి," అన్నాడు.

ఈ మాట వినగానే శంతనుడికి తన కొడుకు గాంగేయుడు జ్ఞాపకం వచ్చి,



బాధ కలిగింది. అతను దాశరాజు అన్న మాటకు ఏ జవాబూ ఇయ్యకుండా, వెనక్కు తిరిగి ఇంటికి వచ్చేశాడు. కాని అతని మనసు దాశకన్య మీదనే ఉన్నది. అతను తీరని విచారంతో బాధపడుతూ, భోజనం చేయలేదు.

ఆ స్థితిలో గాంగేయుడు తన తండ్రిని చూసి, "అలా దిగులుగా ఉన్నావేమిటి? కారణం నాకు చెప్పరాదా? బలమైన శత్రువు ఎవడైనా ప్రతిఘటించాడా? జరగరాని పని ఏదైనా జరిగిందా? నేనుండగా నువు విచారంగా ఉండవలసినపనిఏమిటి? నీ కేదైనా కోరిక ఉన్న పక్షంలో నేను తీర్చుతాను." అన్నాడు.

కొడుకు మాటలు విని శంతనుడు కొంచెం బిడియపడుతూ, "నాయనా, ఒక్కడే కొడుకు కావటం విచారం కాకేమిటి? ఒక కొడుకు కొడుకుకాడు, ఒక కన్ను కన్నుకాదంటారు. దైవికంగా ఉన్న ఒక్క కొడుకూ పోతే, తండ్రి గతి ఏం కావాలి?" అన్నాడు.

గాంగేయుడు అసలు విషయం ఏమిటో మంత్రుల నడిగి తెలుసుకుని, వారిని వెంట బెట్టుకుని దాశరాజు దగ్గిరికి వెళ్ళి, "ఏమయ్యా, నీ కూతురిని నాతండ్రి కిచ్చి పెళ్ళిచెయ్యి. నేను ఆమెను తల్లిగానూ, శంతనుణ్ణి తండ్రిగానూ భక్తితో చూసుకుంటాను." అన్నాడు.

దానికి దాశరాజు "నా కూతురిని నువే పెళ్లాడు. నువు ఉండగా దాని కొడుకు రాజ్యం చెయ్యటం ధర్మంకాదు గదా," అన్నాడు.

"నీ కూతురిని నాకు తల్లిగా ఇయ్యి. ఆమె కొడుకే రాజ్యం చేస్తాడు." అన్నాడు గాంగేయుడు.

"అయ్యా, నువు రాజ్యం వదిలితే వదలవచ్చు. కాని నీ కొడుకు నా మనమడికి రాజ్యం రానిస్తాడని ఏమిటి?" అని దాశరాజు అడిగాడు.

"నేను పెళ్ళే చేసుకోను. ఇక నాకు కొడుకులు కలిగేదేమిటి? నన్ను గురించి

ఎలాటి సందేహాలూ పెట్టుకోక, నీ కూతురిని నాకు తల్లిగా ఇయ్యి.'' అన్నాడు గాంగేయుడు.

ఇందుకు దాశరాజు సమ్మతించి, సత్యవతిని శంతనుడికి భార్యగా ఇచ్చి పెళ్లి చేశాడు. రాజ్యం కోరననీ, పెళ్ళి చేసుకోననీ శపథం చేసిన కారణంగా గాంగేయుడికి భీష్ముడనే పేరు సార్థకమయింది.

కొంత కాలం గడిచింది. సత్యవతి శంతనుడికి ఇద్దరు కొడుకులను కన్నది. వారి పేర్లు చిత్రాంగదుడూ, విచిత్రవీర్యుడూనూ. అయితే దురదృష్టవశాన ఇద్దరూ పిల్లలు లేకుండానే అకాల మరణం పొందారు.

అప్పుడు విచిత్రవీర్యుడి భార్యలలో పెద్దదైన అంబిక, అత్తగారు ఆజ్ఞాపించిన మీదట వ్యాసుడికి ఒక కొడుకును కన్నది. కాని ఆ కొడుకు, ధృతరాష్ట్రుడు, గుడ్డివాడు. ధృతరాష్ట్రుడు రాజుగా ఉండటానికి పనికిరాడని, సత్యవతి తన రెండో కోడలైన అంబాలిక చేత వ్యాసుడికి మరో కొడుకును కనిపించింది. ఆ కొడుకు పాండురోగంతో పుట్టిన పాండురాజు.

ఈ విధంగా రెండు ప్రయత్నాలు విఫలం కావటంచేత సత్యవతి అంబికను వ్యాసుడి వల్ల మరొక కొడుకును కనమన్నది. అయితే అంబికకు అది ఇష్టం కాక, వ్యాసుడి వద్దకు తన దాసిని పంపింది. ఆమెకు విదురుడు పుట్టాడు.





వాడే కర్ణుడు. సూతుడికి దొరికి, అతని ఇంట పెరిగాడు.

పాండవులు పుట్టేనాటికి పాండురాజు రాజ్యాన్ని ధృతరాష్ట్రుడికి అప్పజెప్పి తన భార్యలతో అరణ్యవాసం చేస్తూ, అక్కడే మరణించాడు. మాద్రి అతనితో పాటు సహగమనం చేసింది. కుంతి పాండవులను తీసుకుని ధృతరాష్ట్రుడి పంచ చేరింది.

పాండవులు అయిదుగురూ కలిసి ద్రుపదుడి కూతురైన ద్రౌపదిని పెళ్లాడి, ఆమెకు పిల్లలనుకన్నారు. అర్జునుడు కృష్ణుడి చెల్లెలైన సుభద్రను పెళ్లాడి, అభిమన్యుణ్ణి కన్నాడు. అభిమన్యుడు భారతయుద్ధంలో చచ్చిపోయే సమయానికి అతని భార్య ఉత్తర గర్భవతిగా ఉంది. పరీక్షిత్తును కన్నది.

భారత యుద్ధంలో తన కొడుకులందరూ చావగా, ధృతరాష్ట్రుడూ, గాంధారీ యుధిష్ఠిరుడి వద్ద ఉండిపోయారు. ధర్మరాజు వారిని ఎంతగానో ఆదరించాడుగాని, భీముడు వారిని సూటిపోటి మాటలతో అదే పనిగా అవమానించాడు.

చివరకు ధృతరాష్ట్రుడు గాంధారినీ, విదురుణ్ణీ, సంజయుణ్ణీ వెంట బెట్టుకుని వానప్రస్థానం వెళ్లిపోయాడు. కుంతి

భీష్ముడు పాండురాజును రాజుగా చేశాడు. పాండురాజు విదురుణ్ణి మంత్రిగా పెట్టుకుని రాజ్యం ఏల నారంభించాడు. ధృతరాష్ట్రుడు గాంధారినీ, మరొక వైశ్య స్త్రీనీ పెళ్ళాడాడు. గాంధారికి నూరుగురు కొడుకులూ, వైశ్యస్త్రీకి ఒక కొడుకూ కలిగారు. పాండురాజు కుంతీ, మాద్రీ అనే భార్యలను చేసుకున్నాడు. కుంతికి ముగ్గురు కొడుకులూ, మాద్రికి ఇద్దరూ పుట్టారు. వారే పాండవులు—యుధిష్ఠిర, భీమ, అర్జున, నకుల, సహదేవులు.

అయితే కుంతి పెళ్ళికాక పూర్వమే సూర్యుడికి రహస్యంగా ఒక కొడుకును కని,. వాణ్ణి ప్రవాహంలో విడిచిపెట్టింది.

కూడా వారి వెంట, వెళ్ళింది. ఆరు సంవత్సరాలు గడిచాయి. ఒకనాడు యుధిష్ఠిరుడు కలగన్నాడు. ఆ కలలో కుంతి చాలా నీరసించి ఉన్నట్టు కనబడింది. యుధిష్ఠిరుడు తన తమ్ములకు ఈ మాట చెప్పి, తనకు ధృతరాష్ట్రుణ్ణీ, గాంధారినీ కూడా చూడాలని ఉన్నదని చెప్పాడు.

అందరూ సరేనంటే సరేనన్నారు. పాండవులు ద్రౌపదినీ, సుభద్రనూ, ఉత్తరనూ వెంటబెట్టుకుని, పౌరజనులు కలిసిరాగా, శతయూపాశ్రమానికి వెళ్లారు. అక్కడ ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ ఉన్నారుగాని, విదురుడు లేడు.

విదురుడు అరణ్యంలో మరొక ప్రాంతాన ఏకాంతంగా తపస్సు చేసుకుంటున్నాడని ధృతరాష్ట్రుడు చెప్పాడు.

యుధిష్ఠిరుడు విదురుణ్ణి వెతుక్కుంటూ గంగాతీరం వెంబడి వెళ్లి, ఒకచోట ఘోర తపస్సులో ఉన్న విదురుణ్ణి చూసి, తన పేరు చెప్పుకుని, దణ్ణంపెట్టాడు. విదురుడు జవాబియ్యలేదు. అయితే అంతలోనే విదురుడి ముఖం నుంచి తేజస్సు బయలుదేరి వచ్చి, యుధిష్ఠిరుడి ముఖంలో ప్రవేశించింది. విదురుడు చచ్చిపడిపోయాడు.

యుధిష్ఠిరుడు ధృతరాష్ట్రుడి వద్దకు తిరిగి వచ్చి, విరుదుడి మరణం గురించి చెప్పి, కొంతకాలం వారివెంట ఉండి, తిరిగి తన వారితో హస్తినాపురానికి వెళ్లిపోయాడు.

మరికొంత కాలానికి ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ కార్చిచ్చులో చిక్కుకుని కాలిపోయారు. సంజయుడు అంతకు ముందే ఏదో తీర్థంలో చనిపోయాడు.

కౌరవ, పాండవ వంశాలకు అంకురంగా మిగిలిన పరీక్షిత్తు, ఒక ముని శాపంచేత, తక్షకుడు కరిచి మరణించాడు. జనమేజయుడు, పరీక్షిత్తు కొడుకు తండ్రి చావుకు ప్రతీకారంగా సర్పయాగం చేసి, అనేక సర్పాలను అగ్నిలో ఆహుతి చేసి, చివరకు విరమించాడు.






# సాధులు వస్తారు, జాగ్రత్త!

రాధమ్మ వంట ఇంట్లో ఉండగా, "అమ్మగారూ! అమ్మగారూ!" అన్న పిలుపు వినపడింది. ఆమె బయటికి వచ్చి చూస్తే ఒక మనిషి పిల్లవాణ్ణి ఎత్తుకుని నిలబడి ఉన్నది. ఆమె బిచ్చగత్తె అనుకుని రాధమ్మ, "ఇంకా వంట కాలేదు. కాస్త ఆగిరా," అన్నది.

"నేను బిచ్చానికి రాలేదు, అమ్మగారూ! మాది శ్రీనివాసాపురం. నా పేరు గౌరమ్మ. నాలుగు రోజుల క్రితం మా ఆయన చేను నుంచి ఇంటికి వచ్చే దారిలో లంబాడీ పిశాచం సోకి, కడుపు నొప్పితో ఇంటికి వచ్చాడు. ఎన్ని మందులు పోసినా, బాధ తగ్గకపోగా రక్తం వాంతులు మొదలయాయి. తెల్లవారి, దైవంలాగా ఒక సాధువు వచ్చాడు. అయన మంత్రించగానే వాంతులు తగ్గాయి. కడుపునొప్పి పోయింది. డబ్బులిచ్చినా తీసుకోకుండా పోయాడు సాధువు. నిన్న మళ్ళీ కడుపు నొప్పి మొదలయింది. ఈ ఊళ్ళో ఆ సాధువు కనిపించాడని మా ఊరి వాళ్లు చెప్పగా వచ్చి, ఉదయం నుంచి తెగ తిరుగుతున్నాను. కాని ఆయన కనిపించలేదు. ఒకవేళ ఆయన, మీ ఇంటికేసి వచ్చి కనిపిస్తే కాస్త మా ఊరికి రమ్మని చెప్పండి, అమ్మ గారూ!" అన్నది గౌరమ్మ.

"అలాగే," అని ఆ మనిషికి మాట ఇచ్చి, తలుపు మూసి లోపలికి వెళ్ళింది రాధమ్మ.

ఆమె వంట పూర్తిచేసి, విశ్రాంతి తీసుకుంటూండగా, "మాతా! అన్నపూర్ణేశ్వరీ!" అన్న కేక బయటినుంచి వినిపించింది.

రాధమ్మ వెళ్లి తలుపు తెరిస్తే, బయట సాధువు ఉన్నాడు. వెంటనే గౌరమ్మ

వి. యజ్ఞరామయ్య



ఒక సాధువు కోసం తెగతిరిగిందన్న విషయం జ్ఞాపకం వచ్చి, "మీకు గౌరమ్మ తెలుసా?" అని ఆమె అడిగింది.

''ఏ గౌరమ్మ, మాతా?'' అని అడిగాడు సాధువు.

''ఆమెది శ్రీనివాసాపురమట. ఆమె భర్తకు లంబాడీ పిశాచం సోకితే విడిపించారటగా? మళ్లీ తన భర్తకు కడుపు నొప్పి ఆరంభమయిందని సాధువును వెదుక్కుంటూ వచ్చింది,'' అన్నది రాధమ్మ.

''అఁ! జ్ఞాపకం వచ్చింది. ఈ పూట ఈ ఊళ్ళో పనున్నది. రేపు వెళతా,'' అన్నాడు సాధువు.

సాధువు మీద రాధమ్మకు విశ్వాసం ఏర్పడింది. ఆమె సాధువును లోపలికి ఆహ్వానించి, తన సమస్య గురించి చెప్పింది.

సాధువు అంతా శాంతంగా విని, ''రాధమ్మా, పెళ్లి అయిన కొత్తల్లో, నీ భర్తకు అన్నం తీసుకుని చేనుకు వెళుతూ, ఒక మర్రిచెట్టు కింద ఎవరో పారేసిన దిగదుడుపును దాటావు. ఆ రాత్రే నీకు జ్వరం వచ్చి, పదిరోజులు బాధించింది. ఆ కారణంగానే నీకు సంతానం కలగలేదు. బాగు చేయించుకో, సంతానం కలుగుతుంది,'' అన్నాడు.

సాధువు తెప్పించమన్న వస్తువులు వెంటనే తెప్పించింది రాధమ్మ. సాధువు పసుపు, కుంకాలతో యంత్రాలు వేసి, వాటిమీద పీట వేసి, రాధమ్మను కూర్చోమని, మంత్రాలు చదువుతూ, నిమ్మకాయలు కోసి, నెత్తిమీద నుంచి అటూ ఇటూ పడేటట్టు చేసి, కొబ్బరికాయ కొట్టి, నీళ్ళు ఆమె నెత్తిన చల్లి, సంచిలోనుంచి తాయెత్తు తీసి, ఆమె నొసట ఉంచి, కర్పూర హారతి ఇచ్చాడు. కర్పూరం వాసన తగలగానే రాధమ్మకు మైకం వచ్చినట్టయింది. సాధువు తాయెత్తును ఆమె మెడలో కట్టుతూ, ఆమె మెడలో ఉండిన బంగారు గొలుసును ఒడుపుగా

లాగశాడు. రాధమ్మ నిశ్చలంగా ఉండి పోయింది.

సాధువు మీద నీళ్ళు చల్లి.నాక. రాధమ్మకు మైకం వదిలింది.

''ఇక నీకు సంతానం కలుగుతుంది, మాతా!'' అంటూ సాధువు దిగదుడుపును తన బట్టలోకి ఎత్తుకున్నాడు.

రాధమ్మ ఇంట్లోకి వెళ్ళి, పాతిక రూపాయలు తెచ్చి ఇస్తే, ''వద్దు, వద్దు,'' అంటూనే సాధువు ఆ డబ్బు తీసుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

రాధమ్మ ఎంతో తృప్తితో, తనకు పుట్టబోయే పిల్లల్ని గురించి ఆలోచిస్తూ నిద్రపోయి, తన భర్త సోమయ్య పిలుపుకు నిద్రలేచి వెళ్లి, తలుపు తీసింది. సోమయ్య ఇంట్లో అడుగు పెట్టుతూనే పసుపు కుంకాలు చూసి అడిగాడు. రాధమ్మ జరిగినది చెప్పింది.

''ఎవరి పిచ్చి వారికి ఆనందం,'' అన్నాడు సోమయ్య.

ఆ రాత్రి సోమయ్య భోజనం చేసి పడుకుని, రాధమ్మ ఆకులకు సున్నం రాచి ఇస్తూంటే, ఆమె మెడలోని తాయెత్తు పట్టుకుని, ''ఇదేనా నీకు పిల్లలను ఇచ్చేది?'' అని అడిగాడు.

''మీకు ప్రతిదీ వేళాకోళమే!'' అంటూ ఆమె మెడ తడువుకున్నది. గొలుసు చేతికి తగలలేదు. ఆమె ముఖం ఒక్కసారిగా మాడినట్టయింది. దిగాలున లేచి ఆమె ఇల్లంతా వెతికింది, భర్తను



మంచం మీదినుంచి లేవగొట్టి, పక్క బట్టలన్నీ దులిపింది.

ఆమె పడుతున్న కంగారంతా చూసి సోమయ్య, "ఈ హడావిడంతా ఏమిటి? దేనికోసం వెతుకుతున్నావు?" అని అడిగాడు భార్యను.

"నా గొలుసు!" అన్నది రాధమ్మ కన్నీళ్ళతో.

"ఎక్కడ పెట్టావు?" అని భర్త అడిగాడు.

"ఉదయం తలంటు స్నానం చేసి మెడలో పెట్టుకున్నాను," అంటూ రాధమ్మ ఏడ్చింది.

సోమయ్యకు సాధువు మీద అనుమానం పోయింది; అతని కోసం అప్పటికప్పుడే ఊరంతా గాలించాడు. సాధువు జాడ లేదు. ఊరికి ఉత్తరాన మైలు దూరాన ఒక పాడుబడిన దేవాలయం ఉన్నది. అక్కడ కూడా వెతకాలనిపించి, సోమయ్య తన పాలేరును వెంట పిలుచుకుని బయలుదేరాడు.

వాళ్ళు దేవాలయం చేరేసరికి బాగా చీకటిపడింది. దేవాలయం మెట్లమీద పిల్లవాడు ఉన్నాడు. దేవాలయంలో ఒక మూల ఎవరో స్త్రీ వంట చేస్తున్నట్టు సోమయ్యకు పొడగట్టింది.

ఇంతలో తాగిన మత్తులో పాడుతూ ఎవరో రావటం వినిపించింది. సోమయ్యా, పాలేరూ గుడి గోడ వెనక దాగారు. తాగుబోతు చేతిలో ఉన్న సీసా కిందపెట్టి, "ఇదిగో, ఏం తెచ్చానో చూడవే!" అంటూ గొలుసు తీసి చూపించాడు.

వెంటనే సోమయ్యా, పాలేరూ వాడి మీద పడి, గొలుసు లాగేసుకుని, వాణ్ణి చావ బాదారు. వెంటనే వాడికి మత్తు వదిలి, సోమయ్య కాళ్ళమీదపడి, తనను చంపవద్దని బతిమాలాడు. గౌరి కూడా సోమయ్య కాళ్ళమీదపడి ఏడ్చింది.

సోమయ్య ఇంటికి తిరిగివచ్చి, గొలుసు రాధమ్మకిస్తూ, "ఆ సాధువు నీ మెడలో గొలుసు తీస్తుంటే నీ తెలివి ఏమయింది?" అన్నాడు. రాధమ్మకు నోట మాట రాలేదు.



# సద్వినియోగం

వెంకటయ్య ధనికుడేగాని పరమలోభి. అతను భార్య పోరుపడలేక, తీర్థయాత్రలకు బయలుదేరుతూ, ఇంటి బాధ్యత కొడుకు మీద పెట్టి వెళ్ళాడు. ఆ ఇంటికి బావి లేదు. ఊరబావి నుంచి నీళ్ళు తెచ్చుకోవాలి. కొడుకు శీనయ్య బావి తవ్వించుకుందామని ఎన్ని సార్లు చెప్పినా, "చూతాం లే!" అని వెంకటయ్య వాయిదా వేస్తూవచ్చాడు, డబ్బు ఖర్చు ఇష్టంలేక.

తండ్రి గట్టిగా వద్దనలేదు గనుక శీనయ్య తమ పెరట్లో బావి తవ్వించసాగాడు. రెండడుగుల లోతున ఇనప్పెట్టె దొరికింది. దాని నిండా డబ్బూ, బంగారు నగలూ ఉన్నాయి. అవి ఏ బాపతో శీనయ్యకు అర్థంకాలేదు.

"బాబూ, అవి మీ పూర్వీకులవి అయి ఉంటాయి. ధర్మాత్ములు! ఆ డబ్బు మా బోటి పేదవాళ్ళకు పంచేసి పుణ్యం సంపాదించు కోండి," అన్నారు కూలీలు.

అనుకోకుండా వచ్చిన డబ్బు! శీనయ్య ధర్మబుద్ధి గలవాడు. అందుచేత డబ్బూ, బంగారమూ పేదవాళ్ళకు పంచేశాడు. వెంకటయ్య తిరిగి వచ్చి బావి చూసి, బావి తవ్వినచోట తాను పాతిపెట్టిన ఇనప్పెట్టె ఏమయిందని అడిగాడు. శీనయ్య జరిగినదంతా చెప్పాడు. లోభి వాడి ప్రాణం కడబట్టినట్టయింది. తాను డబ్బు అక్కడ దాచినమాట అతను తన భార్యకు కూడా చెప్పి ఉండలేదు!

—కె. శరత్‌చంద్రరెడ్డి



# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1979 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.







Devidas Kasbekar

Devidas Kasbekar

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు:

మొదటి ఫోటో : నడచితే దారి

రెండవ ఫోటో : ఎక్కితే స్వారీ

పంపినవారు : వై. పి. నిరంజన్‌రాజు, మార్కాపూర్. (ప్రకాశం జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

# మీ అనుంగు...

# NP డబుల్ బబుల్ గమ్




## ఇప్పుడు ఇంటర్నేషనల్ ప్యాకింగ్‌లో కొత్త మెరుగులు దిద్దుకుంది

అవును నేస్తాలూ, మీకి సంతోషవార్త చెప్పాలని ఉవ్విళ్లూరుతున్నాము. మీరు ఆడుకోడానికి ఇప్పుడు బోల్డు బుడుగులు (సారీ, బుడగలు). చూశారా, ఉత్సాహంతో మాటలు కూడ తడబడుతున్నాయి. ఎందుకంటే ఉత్సాహంతో కేరింతలు కొడుతున్న మిమ్మల్ని మా డబుల్ బబుల్ గమ్ యొక్క ఇంటర్నేషనల్ రేపర్ మీద పట్టేశాముగా? అందుకని. ఇప్పుడు ఎక్కువ సేపూ వుండే కొత్త పరిమళాలు, ఎక్కువ బుడగలు, మరింత మజా. పిల్లల పిడుగులకు ఎన్‌పి బుడగల వడగళ్లు.

(ప్రతి ప్యాకెట్‌లోనూ రంగు రంగుల ఫారిన్ కారు చిత్రం జామ్మని ఆటలోకి వురకడానికి.)










**ది నేషనల్ ప్రోడక్ట్స్**
135, కావల్ బైరసాంద్ర, బెంగుళూరు

NP బబుల్ గమ్‌కి మాత్రమే ఐ.ఎస్.ఐ. గుర్తు వుంది.

*Dattaram-NP-27 TEL*

# పాపిన్స్ కాగితంతో తమాషా

ఇదుగో రామ్, శ్యామ్
మీకు నేర్పించే కొన్ని చిటకాలు—
కాగితంతో చేసేవి—
గమ్మత్తుకీ, సరదాకీ

**'విండ్ మిల్' చిత్రవిచిత్రం**
మీక్కావలసినవి : చతురప్రాకారంలోని పలచని కార్డ్ బోర్డు, కత్తెర, మేకు లేదా పిన్ను, మట్టి, బటన్, వెదురు గడ, పెన్సిళ్లు, స్కేలు.



చేసే విధానం అంచెలవారీగా
చతుర ప్రాకారపు కార్డ్ బోర్డు కాగితం పైన ఒక మూలనుంచి మరొక మూలకు 2 ఐమూల రేఖలను గీయండి. ప్రతి చివరనుంచి కేంద్రం వేపుకు ఉండేలా కొయ్యండి. కోసిన ప్రతి భాగమూ చదరానికి ఒక వైపుకు సగం పొడుగు వుండేలా చూడండి.



ప్రతి చివరనీ మధ్యకి వచ్చేలాగ మడిచి చివరల్ని అన్నిటినీ పట్టుకుని, కాగితపు మధ్యలో మేకు లేదా పిన్నును నొక్కండి.





బటన్ వెనక గ్రీజ్ వేసి, వెదురు గడకు మేకు కొట్టండి. విండ్ మిల్ తిరగటానికి బాగా జాగా వదిలిపెట్టండి. ఇంక సరదా మీదే!






## పార్లే పాపిన్స్

పండ్లరుచిగల పిప్పరమెంట్లు
నోరూరించే...మనసుదోచే...మైమరపించే

5 పండ్ల సువాసనలలో—
రాస్బెరి, అనాస, నిమ్మ,
నారింజ, మోసంబి.

everest/78/PP/247-tl